

# అపూర్వుడి సాహసయాత్రలు

హిమాలయ పర్వతాల మధ్య ఒక కొండ మీద నిలబడి సదానందముని చుట్టు పక్కల కలయజూశాడు. మంచుతో కప్పబడిన ఆ లోయ అప్పుడే ఉదయిస్తూన్న సూర్యకిరణాల వెలుగులో బంగారు కాంతితో ప్రశాంతంగా మెరుస్తున్నది. లోయకు దిగువ చిన్న చిన్న నదులూ, విశాలమైన మైదానాలూ కనిపించాయి.

ముని తూర్పుదిక్కు కేసి ఒకసారి చూసి, మళ్ళీ లోయ మీదికి దృష్టిని మళ్ళించాడు. ఆయన మనసులో ఎన్నో ఆలోచనలు కలిగాయి. భగవంతుడు ఎంతటి సుందరమైన ప్రకృతిని సృష్టించాడు. అందమైన భూమినీ, భూమిపై రకరకాల పక్షులనూ, మరెన్నో జంతువులనూ సృష్టించాడు. అఖరికి మనిషిని సృష్టించాడు. మనిషికి మంచిని గ్రహించి శాంతియుతంగా ముందుకుసాగే మహోన్నతమైన శక్తిని ప్రసాదించాడు. మంచి నుంచి చెడును వేరుచేసి చూసే వివేకం కూడా ఇచ్చాడు. ఇన్ని ఉన్నప్పటికీ ఇప్పుడు ప్రపంచం ఎలా ఉన్నది? కొందరిలో అంతా తమదే కావాలన్న స్వార్థం పెరగకపోతే ఈ భూమి మరింత అందంగా, ఆనందంగా ఉండేది కదా! మంచి తప్ప ఎదుటివారికి హాని తలపెట్ట లేని నూతన మానవజాతి ఆవిర్భావం సాధ్యం కాదా?

ఈ సమస్యను గురించి ముని సుదీర్ఘంగా ఆలోచించి, ఒక నిర్ణయానికి







వచ్చాడు. ప్రకృతి రహస్యాలను ఆకళింపు చేసుకుని సదానందముని తన యోగ శక్తితో ఎన్నో ప్రయోగాలు చేశాడు. ఆఖరికి తన చిరకాల వాంఛకు కార్యరూపం ఇవ్వడానికి ఇప్పుడు సంకల్పించాడు.

''గురువర్యా, శుభఘడియలు ఆసన్న మయ్యాయి!'' అన్నాడు పక్కనే ఉన్న గుహ నుంచి వెలుపలికి వచ్చిన ముని శిష్యుడు భక్తితో చేతులు జోడించి.

''అవును సోహం! యజ్ఞం పరిసమాప్తి చేయాలి!'' అన్నాడు ముని.

ఇద్దరూ కలిసి గుహ లోపలికి వెళ్ళారు. గుహకు రెండువైపులా ద్వార మార్గాలు ఉన్నాయి. గుహ మధ్య భాగంలో హెూమాగ్ని రగులుతున్నది. ముని వెళ్ళి హెూమగుండం ముందు కూర్చుని, ''సోహం! ఇప్పుడు అగ్నిని జాగ్రత్తగా చూస్తూవుండు. అగ్నిజ్వాలలు క్రమంగా పైకి ఎగబడాలి. అప్పుడే మనం తలపెట్టిన కార్యం ఫలప్రదమవుతుంది," అని కళ్ళు మూసుకుని కొంతసేపు ధ్యానంలో గడిపాడు. ఆ తరవాత మరి కొంతసేపు దీక్షతో మంత్రాలు జపిస్తూ, వెన్ననూ, కొన్ని పుష్పాలనూ, మరికొన్ని పత్రాలనూ హెూమాగ్నికి ఆహుతిచ్చాడు.

అగ్నిజ్వాలల మధ్య క్రమంగా ఒక రూపం ఏర్పడడం చూసి ముని కళ్ళు మెరిశాయి. క్షణంలో అదొక మానవుడి రూపం ధరించింది. మంటలనుంచి వెలుపలికి దూకిన ఆ వ్యక్తికి మనిషికి లాగానే అన్ని అవయవాలూ సక్రమంగా ఉన్నాయి. చూడడానికి చక్కటి బొమ్మ లాగా ఉన్నాడు. అయితే, బొమ్మకన్నా కాస్త ఎత్తుగా ఉన్నాడు.

ఆ వ్యక్తి మునికి నమస్కరించి, ''నేనెవరిని?'' అని అడిగాడు.

''నువ్వు మనిషివి! అయినా మామూలు మనిషివి కావు! చాలా భిన్నమైనవాడివి. యజ్ఞశక్తితో పంచభూతాల నుంచి నిన్ను ప్రత్యక్షంగా సృష్టించాను. నీకు సర్వ శక్తులూ ఉన్నాయి. మంచీచెడూ, కరుణా







క్రౌర్యం, సత్యం అసత్యం, సర్వం నీకు తెలును. అయినా, చెడుపట్లా, క్రౌర్యం పట్లా, అసత్యంపట్లా నీకు అసక్తి ఉండదు. మామూలు మనుషులు తమ కోరికలు నెరవేర్చుకోవడానికి పాటు పడతారు. అయితే, నువ్వు ధర్మరక్షణే జీవితాశయంగా కార్యాచరణకు పూనుకుంటావు. నీ ద్వారా నా కల ఫలించినట్టయితే నూతన మానవజాతికి నువ్వే మార్గదర్శకుడవు కాగలవు!" అన్నాడు ముని ఎంతో గంభీరంగా.

"అయినా, నేను అందరికన్నా మరీ పొట్టిగా వున్నాను కదా! ఎందుకలా జరిగింది?" అని అడిగాడా వ్యక్తి.

"నువ్వు అందరికన్నా ప్రత్యేకమైన వాడివని చెప్పానుకదా! మిగతావాళ్ళ కన్నా నీ మనసు మహోన్నతమైనది. అందరినీ మించిన తెలివితేటలు, శక్తి యుక్తులు నీవి. ఒక వ్యక్తిలో ఒకటి ఎక్కువగా వుంటే వేరొకటి తక్కువగా వుండడం ప్రకృతి నైజం. నీ శరీరం చిన్నదే. అయితే, దాని శక్తి అమోఘం. అందుకే నువ్వు మానవజాతి పురోగతికీ, ప్రపంచ అభ్యుదయానికీ పాటుపడాలి!" అన్నాడు ముని.

"చిత్తం!" అన్నాడా వ్యక్తి.

"నీ ఈ బుల్లిదేహం, శీఘ్ర గమనానికి అనుకూలంగా వుంటుంది," అని చెప్పి కొంతసేపు మౌనం వహించిన ముని మళ్ళీ, "అయినా, నువ్వు ఎప్పటికీ ఇలాగే పొట్టివాడిగా వుండిపోవు. నీ జీవితంలో తొలిదశ పోరాటమయంగా వుంటుంది. విద్రోహశక్తులతో నువ్వు పోరాడవలసి వుంటుంది. మలిదశలో నీకు శాంతియుత జీవితం సంప్రాప్తమవుతుంది. అప్పుడు నీకు మామూలు మానవశరీరం వస్తుంది. అది ఎప్పుడు ఎలా జరుగుతుందో కాలమే నిర్ణయిస్తుంది!" అన్నాడు.

ఆ తరవాత ముని కళ్ళు మూసుకుని, ఒక్కక్షణం మౌనం వహించి, కళ్ళు తెరిచి మందహాసం చేస్తూ, "నాయనా,



నీవంటి వాళ్ళు ఇంతకు పూర్వం లేరు. కాబట్టి నీకు 'అపూర్వుడు' అని నామకరణం చేస్తున్నాను,'' అన్నాడు.

ఆ తరవాత ముని ఇచ్ఛానుసారం, సోహం, అపూర్వుడి ముందు కొన్ని ఫలాలు తెచ్చి ఉంచాడు. అపూర్వుడు వాటిలో కొన్ని పళ్ళు తీసి తిన్నాడు.

''నాయనా, ఈ పళ్ళు తిన్నవారికి చాలా రోజులవరకుఆకలిదప్పులుండవు!'' అన్నాడు ముని.

''ధన్యవాదాలు మహాత్మా! నేనిప్పుడు గుహనుంచి వెలుపలికి వెళ్ళవచ్చా?'' అని అడిగాడు అపూర్వుడు.

''వెళ్ళవచ్చు. గుహ నుంచి విశాల ప్రపంచంలోకి,'' అన్నాడు ముని.

అపూర్వుడు మునికి భక్తితో నమస్కరించి, గుహనుంచి వెలుపలికి నడిచాడు. అతని వెంట, మునీ, శిష్యుడూ వెలుపలికి వచ్చారు.

వెచ్చటి సూర్యకిరణాలు సోకగానే, ''అహా! ఎంత హాయి! ఎంత హాయి! ఎంతో మధురంగా వున్నది!'' అన్నాడు అపూర్వుడు.

''నాయనా, నీ ఈ మధురానుభూతి శాశ్వతం కావాలని ఆశీర్వదిస్తున్నాను. నిజానికి ప్రపంచమే ఎంతో మధురమైనది. కాని, మనిషి తన నీచకృత్యాలవల్ల చేదును సృష్టించుకుంటున్నాడు. ఆ చేదును తొలగించడానికి నువ్వు నీవంతు కర్తవ్యాన్ని నిర్వహించాలి!'' అన్నాడు.





ఆ మాటలు వింటూన్న అపూర్వుడి కనుబొమలు హఠాత్తుగా ముడి పడ్డాయి. ''ఏమిటి నేను వింటున్నవి? ఎక్కడివీ ఆర్తనాదాలు! అవిగో జ్వాలలు! అగ్ని జ్వాలలు నాకు కనిపిస్తున్నాయి,'' అని అరిచాడు అపూర్వుడు అమితమైన ఆవేదనతో.

''మాకేమీ వినిపించడం లేదే! కనిపించడం లేదే!'' అన్నాడు సోహం అమితాశ్చర్యంతో.

''మనం వినలేము. మనకన్నా ఎంతో శక్తివంతమైన ఇంద్రియశక్తులు కలవాడు అపూర్వుడు. దూరంలో మనకు కనిపించని, వినిపించని దృశ్యాలను, శబ్దాలను అపూర్వుడు సులభంగా వినగలడు, చూడగలడు. అంతేకాదు, అతడు వాయు వేగంతో పయనించగల సమర్థుడు,'' అన్నాడు ముని.

''తండ్రీ, అక్కడ ఏం జరుగుతున్నదో వెళ్ళి చూడడానికి నన్ను అనుమతించండి!'' అన్నాడు అపూర్వుడు.

''అలాగే వెళ్ళిరా నాయనా! వెళ్ళిరా! దేవుడే నీకు తోడు!'' అని ఆశీర్వదించాడు ముని.

మరుక్షణమే అపూర్వుడు పరిగెత్త సాగాడు. పరుగువేగం పెరిగేకొద్దీ అతడొక గాజుబొమ్మ లాగా మారి, ఆ తరవాత అదృశ్యమైపోయాడు!

''ఏమిటిదంతా! అపూర్వుడెలా మాయమైపోయాడు?'' అని అడిగాడు సోహం అమితాశ్చర్యంతో.

''వేగం ఒక స్థాయికి చేరగానే అపూర్వుడి దేహం వెలుగులోనూ, గాలిలోనూ ఒకటిగా కలగలిసి పోతుంది. అందుకే అతడు సాధారణ మానవ నేత్రాలకు కనిపించడు!'' అని వివరించాడు ముని.

* * *

''జమీందారుగారి నూతన భవన నిర్మాణానికి రానంటారా? అయితే మీకు మీ కొంపల్లో బతికే ప్రాప్తం లేదు,'' అని

అరుస్తూ కొందరు దృఢకాయులు మండుతూన్న కాగడాలతో పూరిగుడిసెలకు నిప్పంటిస్తున్నారు.

"ఎంతకాలమని పని చేయగలం బాబూ! మాకూ భార్యా పిల్లలు ఉన్నారు కదా! వాళ్ళనూ పోషించాలి కదా! ఒట్టి పుణ్యానికి రోజూ జమీందారు పనే చూస్తే మా కడుపు లేంకాను? మేం బతికేదెలా? మా భార్యాపిల్లల గతేంకాను?" అంటూ రోదిస్తున్నారు బలహీనులయిన కూలీలు వాళ్ళను అడ్డుకునే శక్తిలేక.

పొగరుబోతులయిన జమీందారు నౌకర్లకు వాళ్ళ మాటలేవీ వినిపించలేదు. దిక్కులు ప్రతిధ్వనించే విధంగా వికటాట్ట హాసం చేస్తూ, గుడిసెలకు నిప్పంటించ సాగారు. ఒక్కొక్క గుడిసే అగ్నిజ్వాల లకు ఆహుతి కాసాగింది.

హఠాత్తుగా అగ్నిజ్వాలలపై వానజల్లు ప్రారంభమయింది. జమీందారు నౌకర్లు ఆశ్చర్యంతో ఆకాశం కేసి చూశారు. ఒక్క మేఘం లేదు. మబ్బులేకుండా వాన ఎలా కురుస్తున్నది? హఠాత్తుగా ఒక వింత ధ్వని వినిపించింది. అందరూ ఆ ధ్వని వచ్చిన దిక్కుకేసి తిరిగి చూశారు. ఇళ్ళు నానుకుని పారుతూన్న నది మోకాళ్ళ లోతు నీళ్ళలో ఏనుగుల గుంపు! ఆ ఏనుగులు నదిలోని నీళ్ళను తొండాలతో మంటల మీదికి వేగంగా చిమ్ముతూ ఘీంకరిస్తున్నాయి. కొంతసేపటికి మంటలు చల్లారాయి. వెంటనే ఏనుగులు జమీందారు నౌకర్ల మీదికి నీళ్ళు చిమ్ముతూ వాళ్ళను తరుముకున్నాయి. ఈ హఠాత్ పరిణామానికి బెదిరిపోయిన నౌకర్లు ప్రాణభీతితో చెట్టుకొకరు పుట్ట కొకరుగా చెల్లాచెదరయ్యారు. వెనక నుంచి ఎవరో పకపకా నవ్వడం వాళ్ళకు వినిపించింది.

పెద్ద ఏనుగు మీద అందమైన బొమ్మ లాంటి ఒక వ్యక్తి నిలబడి పకపకా నవ్వుతున్నాడు. ఎవరా విచిత్ర వ్యక్తి? దయ్యమా? దేవుడా? అని నౌకర్లు హడలి పోయారు. —(ఇంకావుంది)









# అపూర్వుడి సాహసయాత్రలు

## 2

[హిమాలయ పర్వతాలలోని సదానందముని తన యోగశక్తితో యజ్ఞం నుంచి అద్భుతమైన శక్తియుక్తులు గల అపూర్వుడనే విచిత్ర వ్యక్తిని సృష్టించాడు. దూరప్రాంతం నుంచి ఆర్త నాదాలు విన్న అపూర్వుడు, అక్కడి నుంచి వాయువేగంతో ఒక గ్రామం పొలిమేరను చేరుకుని, తగలబడుతూన్న పేదల ఇళ్ల మంటలను ఏనుగుల సహాయంతో చల్లార్చాడు.—తరవాత]

ఏనుగులు తరుముకోగానే జమీందారు నౌకర్లు భయంతో, పడుతూ, లేస్తూ మైదానందాటి గ్రామంలోకిపారిపోయారు. ఏనుగులు మరొకసారి తొండాలెత్తి ఘీంకరించి, అపూర్వుడి ఇష్టానుసారం అరణ్యంలోకి వెళ్ళిపోయాయి.

అపూర్వుడు ఈ ప్రపంచానికి కొత్తే. అయినా, అతణ్ణి సృష్టించిన సదానంద ముని వందలాది సంవత్సరాలు కఠోర తపస్సుతో ఆర్జించిన అద్భుతశక్తులను అతనికి ప్రసాదించాడు. అందువల్ల అతనికి ప్రకృతిలోని రహస్య శక్తులను శాసించడం తెలుసు. ఆ అద్భుతశక్తితోనే అతడు క్షణాలలో ఏనుగులను రప్పించి, పేదల ఇళ్ళను మంటలనుంచి కాపాడగలిగాడు. ఏనుగులకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుని వాటిని అరణ్యంలోకి వెళ్ళమని కోరాడు.







లోని ఒక గుడిసెను సమీపించేసరికి బాగా చీకటిపడింది.

"కనికరించండి బాబూ! నా బిడ్డను వదిలిపెట్టి, కావాలంటే నా దగ్గరున్న నగలనూ, డబ్బునూ తీసుకోండి. నా ప్రాణమైనా ఇస్తాను, నా బిడ్డను వదిలి పెట్టండి!" అని ఒకస్త్రీ కంఠస్వరం దీనంగా వినిపించింది.

అపూర్వుడు గుడిసె లోపలికి తొంగి చూశాడు. రాక్షసుల వంటి భయంకరాకారులు ముగ్గురి కాళ్ళపైబడి ఒక పేదరాలు దీనంగా విలపిస్తున్నది.

ఆ ముగ్గురిలో..ఒకడు ఒక చేత్తో పద్నాలుగేళ్ళ కుర్రవాడి నోరుమూసి, వాణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. రెండవవాడి చేతిలో కొరడా ఉన్నది. మూడవవాడి చేతిలోని పొడవాటి కత్తి, దీపం గుడ్డివెలుగులో తళతళా మెరుస్తున్నది.

ఆ దొంగల నాయకుడు కొరడా ఝుళిపిస్తూ, "నీ నగలూ, డబ్బూ మాకు వద్దు. కావలసినంత ధనం మా దగ్గరున్నది. ఎందుకూ పనికిరాని నీ ప్రాణాలు మేమేం చేసుకుంటాం? మా దేవతకు బలి ఇవ్వడానికి కావలసిన శుభలక్షణాలన్నీ నీ కొడుకులో ఉన్నాయి. అందుకే వాణ్ణి ఎత్తుకుపోతున్నాం. మూడు రోజులుగా వాణ్ణి మేము రహస్యంగా గమనిస్తూనే

ఆ తరవాత అపూర్వుడు, ఆకాశంలో కిలకిల ధ్వనులతో ఎగిరే పక్షులనూ, తెల్లటి మేఘాలనూ, ఎత్తయిన వృక్షాలనూ, మెల్లగా వీచేగాలికి కదలాడే లేత కొమ్మలనూ, నదిలోని అలలనూ, అలల తాకిడికి పుట్టిన తెల్లటి నురగలనూ చూస్తూ సాయంకాలం వరకు అమితానందంతో గడిపాడు. సూర్యుడు పడమటి కొండలచాటుకు చేరుతూన్న సమయంలో, గాలిలో హఠాత్తుగా అతడికొక అరుపు వినిపించింది. అపూర్వుడు ఉలిక్కిపడి, మరుక్షణమే పరుగెత్తడం ప్రారంభించాడు. కొంతసేపటికి గాలిలో కలిసిపోయాడు. అతడు ఒక గ్రామం పొలిమేర







వుండు!'' అని హెచ్చరించి, భైరవమల్లు కుర్రవాణ్ణి బరబరా లాక్కుని తన సహచరులతో సహా దూరంగా కనిపించే అడవి కేసి నడవసాగాడు.

గుడిసె నుంచి వెలుపలికి వచ్చిన ఆ పేదరాలు, నెత్తీ నోరూ బాదుకుంటూ, "నాయనలారా, నా బిడ్డను కాపాడండి....నా బిడ్డను కాపాడండి. నా భర్త లేని సమయం చూసి, దొంగలు వచ్చి, నా బిడ్డను ఎత్తుకుపోయారు. కాపాడండి, కాపాడండి!'' అంటూ హృదయ విదారకంగా విలపించసాగింది.

ఆమె కేకలు విని గ్రామస్థులు కొందరు అక్కడికి చేరారు. అయినా, వాళ్ళెవరు కూడా బందిపోట్లను పట్టుకోలేరనిపించింది అపూర్వుడికి. అతడు అక్కడి నుంచి బందిపోట్లను వెంబడించి అరణ్యం కేసి నడవసాగాడు.

దొంగలు చాలా దూరం వెళ్ళి చుట్టూ ఎత్తయిన కొండలు గల ఒక లోయలోకి ప్రవేశించారు. లోయకు ఒకవైపున చాలా గుహలు కనిపించాయి. ఒక పెద్ద గుహ ముందు పదుగురు బందిపోట్లు నిలబడి ఉన్నారు.

"దేవతకు కావలసిన కానుకను తెచ్చాం. అన్నీ సిద్ధమే కదా?'' అని అడిగాడు భైరవమల్లు.

ఉన్నాం. అటువంటి కొడుకును కన్నందుకు నువ్వు గర్వపడాలి!'' అన్నాడు.

"వాణ్ణి కన్నందుకు సంతోషమే. అయినా, ఒక్కగానొక్క బిడ్డను మీ కప్పగించి నేనెలా బతకగలను?'' అన్నది పేదరాలు దీనంగా.

"నీ కొడుకు మాకు ఉపయోగపడుతున్నందకు నువ్వు సంతోషించాలి గాని, బాధపడకూడదు. అదే మాకూ, నీకూ క్షేమం. కేకలు వేసి ఎవరినైనా పిలిచావో నీ ప్రాణాలు దక్కవు. భైరవమల్లు పేరు వింటేనే జనం గజగజలాడిపోతారు. నువ్వూ, నీ భర్తా ప్రాణాలతో వుండాలంటే నోరు మూసుకుని పడి







"సిద్ధమే దొరా. పూజారి గంగులు సరిగ్గా అర్ధరాత్రికి బలి ఇవ్వాలన్నాడు, దొరా!" అన్నాడు అక్కడున్న ఒక దొంగ.

"అలాగే చేద్దాం. ఈ కుర్రవాణ్ణి, దేవతకు పక్కనున్న ఒక గుహలోకి తీసుకుపోయి పచ్చటి పానీయం తాగించి నిద్రపుచ్చండి. ఒక లోటా నీళ్ళలో ఒకే ఒక చుక్క మాత్రమే పచ్చటి ద్రవం వేయండి. ఎక్కువ ఇచ్చారో వాడు తెల్లవారేవరకు లేవలేడు. బలి ఇచ్చేప్పుడు వాడు మేలుకునే ఉండాలి. నిద్రపోకూడదు," అని హెచ్చరించాడు భైరవమల్లు.

ఒక బందిపోటు గుహ లోపలికి వెళ్ళి, లోటా నీళ్ళలో ఒక చుక్క పచ్చటి ద్రవం వేసి, దానిని తాగమని కుర్రవాడికి అందించాడు.

"స్పృహలో వున్నా, లేకపోయినా, కుర్రవాడి కాళ్ళు చేతులు బంధించడం మరిచిపోకండి. వాణ్ణి పట్టుకోవడానికి మూడు రోజులు శ్రమపడవలసి వచ్చింది. వాడు తప్పించుకుంటే...." అని భైరవమల్లు ఇంకా ఏదో చెప్పబోయేంతలో పక్కనున్న ఒక దొంగ అడ్డుపడి, "వాడు తప్పించుకుని ఎక్కడికి పోగలడు దొరా? చుట్టూ కొండలే కదా?" అన్నాడు నవ్వుతూ.

"నోరు మూసుకుని నేను చెప్పినట్టు చెయ్." అన్నాడు భైరవమల్లు చాలా కోపంగా.

ఆ దొంగలు కుర్రవాణ్ణి అక్కడినుంచి గుహలోపలికి తీసుకుపోయి, తమ నాయకుడు చెప్పినట్టు వాడి కాళ్ళు చేతులు గట్టిగా బంధించి, ఒక చాపమీద పడుకోబెట్టారు.

అపూర్వుడు పొదల చాటు నుంచి రహస్యంగా అన్నిటినీ గమనించసాగాడు. అపూర్వుడు కదలడంవల్ల, పొదల మీది ఆకులు మెల్లగా కదిలాయి. దానిని గమనించిన భైరవమల్లు, "ఏమిటది?" అని అడిగాడు.



"కుందేలయి వుంటుంది దొరా!" అన్నాడు పక్కనున్న దొంగ.

ఆ తరవాత ఎవరూ ఆ అలికిడిని పట్టించుకోలేదు.

దొంగలందరూ, అర్ధరాత్రి పూజకు ఏర్పాట్లలో దిగారు. అపూర్వుడు చీకటి మాటున ఒకచోటి నుంచి మరొకచోటికి తిరుగుతూ అక్కడ జరుగుతూన్న తతంగాలను గమనించి, ఆఖరికి, కుర్రవాడు నిద్రపోతూన్న గుహను చేరాడు. వాణ్ణి అమాంతం ఎత్తుకుపోదామా అంటే, వాడు అపూర్వుడి కన్నా చాలా ఎత్తుగా వున్నాడు. ఏనుగునైనా అవలీలగా ఎత్తగలశక్తి అపూర్వుడికి ఉన్నది. అయినా, కుర్రవాడు తన మీద ఉన్నప్పుడు వేగంగా పరిగెత్తగలమా అన్న అనుమానం అతనికి కలిగింది. కుర్రవాడు కనిపించకపోతే దొంగలు చుట్టుముట్టి తమను పట్టుకోగలరు. అప్పుడు ఇద్దరూ పట్టుబడిపోయే అపాయం ఉన్నది. ఇలా ఇలోచిస్తూన్నప్పుడు ఎవరో పకపకా నవ్వడం వినిపించి, అపూర్వుడు గుహ నుంచి బయటకు వచ్చాడు. పక్క గుహలోని ఒక పెద్దపులి విగ్రహం ముందు కొందరు దొంగలు కూర్చుని వున్నారు. ఆ పెద్దపులే వాళ్ళ దేవత. ఆ విచిత్ర దృశ్యం చూసి అపూర్వుడు విస్తుపోయాడు.

"గంగులూ, నువ్వు పూజారివి! ఆ మాట మరిచి నువ్వూ మాతోపాటు తాగావో నీ చేతులు వణకవచ్చు. అప్పుడు నువ్వు కుర్రవాడి తలను ఒక్క వేటుతో తెగ నరకలేవు. అలా నరకకపోయావో నేను నీ తలను తెగవేయగలను. తప్పు చేసిన వాళ్ళను క్షమించడం అన్నది భైరవమల్లు జాతకంలో లేదు! తెలుసుగదా?" అని హెచ్చరించాడు భైరవమల్లు.

"చిత్తం, నన్ను నమ్ము దొరా, నేను తాగను. నేను పూజా కార్యక్రమం చూస్తాను," అంటూ కొన్ని అడవిపూలను విగ్రహం మీదికి చల్లాడు గంగులు.

అక్కడున్న అపూర్వుడికి ఒక ఆలోచన వచ్చింది. వెంటనే అతడు పచ్చటిద్రవం





గల పాత్ర ఉన్న గుహలోపలికి రహస్యంగా వెళ్ళి, ఆ పాత్ర పక్కనే ఉన్న చిన్న లోటాతో ఆ ద్రవాన్ని తీసుకువచ్చి, వాళ్ళు తాగుతూన్న పానీయంలోకి పోశాడు.

దొంగలు ఆ పానీయాన్ని రెండుసార్లు తాగేసరికి మత్తుగా తూలసాగారు. మూడో సారి తాగేలోపల, వాళ్ళందరూ వింతగా నవ్వుతూ, నేలకు ఒరిగిపోయారు. పానీయం పోస్తూన్నవాడు కూడా కిందపడి స్పృహ కోల్పోయాడు.

"ముహూర్తం దగ్గరపడింది. బాలకుణ్ణి తీసుకురండి," అంటూ పూజారి గంగులు వెనక్కు తిరిగిచూసి, నివ్వెరపోయి, "ఏమిటి? ఏమయింది మీకు? అలా పడిపోయారేమిటి?" అని అడిగాడు.

వాళ్ళనుంచి ఎటువంటి సమాధానమూ రాలేదు.

అపూర్వుడు వెంటనే కుర్రవాడు నిద్రపోతూన్న గుహలోపలికి వెళ్ళాడు. అప్పుడే వాడు కళ్ళు తెరిచాడు. కాళ్ళ చేతులకు కట్టిన బంధాలను తెంచిన అపూర్వుడి కేసి ఆ కుర్రవాడు ఆశ్చర్యంతో చూడసాగాడు.

"ఆశ్చర్యపడడానికీ, ఆలోచించడానికీ ఇది సమయం కాదు. మనం వెంటనే ఇక్కడి నుంచి బయటపడాలి. మొదట ఒక దుర్మార్గుడి పని పట్టాలి. నా వెంట




రా!" అంటూ అపూర్వుడు ముందుకు నడిచాడు.

ఆ కుర్రవాడు మంత్రముగ్ధుడిలా అపూర్వుడి వెంట నడిచాడు.

అపూర్వుడు గంగులున్న గుహలోపలికి వెళ్ళి, అక్కడ ఉన్న ఒక పొడవాటి కత్తిని అందుకున్నాడు. పెద్ద పాత్రలోని పానీయాన్ని ఒక రాతి పాత్రలోకి పోసి, గంగులుకు అందించమని కుర్రవాడితో చెప్పి, కత్తిని గంగులు కేసి గురిచేసి, "ఊఁ తాగు. లేదా ప్రాణాలు దక్కవు?" అని ఆజ్ఞాపించాడు.

గంగులు అపూర్వుణ్ణి చూసి దయ్యమనుకుని హడలిపోయి కీచుమంటూ అరిచాడు.





"తాగు!" అని హెచ్చరించాడు అపూర్వుడు.

ఇక చేసేదిలేక గంగులు బిత్తరచూపులు చూస్తూ, ఆ పానీయాన్ని గుటా గుటా తాగేసి, రెండు క్షణాలలో తన సహచరులతో పాటు స్పృహ తప్పి పడిపోయాడు.

గుహనుంచి, వెలుపలికి వచ్చిన అపూర్వుడు కుర్రవాణ్ణి, "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"సమీరుడు," అనిచెప్పాడుకుర్రవాడు.

"వేగంగా నడువు!" అంటూ ముందుకు నడిచాడు అపూర్వుడు.

వాళ్ళిద్దరూ ఉరుకులతో పరుగులతో తెల్లవారేసరికి, సమీరుడి గ్రామాన్ని సమీపించారు. ఆ ప్రాంతాన్ని పాలించే రాజుగారి ఒక సైనికదళం ఒక పట్టణంనుంచి మరొక పట్టణానికి వెళుతూ, మార్గ మధ్యంలో వున్న ఆ గ్రామంకేసి వచ్చింది. సైనికులను చూడగానే, గ్రామ ప్రజలు, బందిపోట్లు చేసిన దుండగాన్ని గురించి వాళ్ళతో చెప్పుకుంటున్నారు.

దూరంనుంచి ఆ దృశ్యాన్ని చూసిన అపూర్వుడు, కుర్రవాడితో, "సమీరా, నువ్వు వెళ్ళి, బందిపోట్ల స్థావరాన్ని సైనికులకు చెప్పు. మధ్యాన్నం వరకు బందిపోట్లకు స్పృహ రాదు. సైనికులు వాళ్ళను సులభంగా పట్టుకోగలరు. ఇక నేను వస్తాను," అన్నాడు.

"మీకు నా కృతజ్ఞతలు ఎలా తెలియచేయాలో తెలియడంలేదు!" అన్నాడు సమీరుడు చేతులు జోడించి కన్నీళ్ళు కారుస్తూ.

"సమీరా! ఈ రోజు నువ్వు ప్రాణాపాయంనుంచి బయటపడగలిగావంటే, మునుముందు జీవితంలో ఏదో మహత్తర కార్యం సాధించడానికే అలా జరిగిందనిపిస్తున్నది. నీకు నా సహాయం కావలసి వచ్చినప్పుడు నీ మనసులో నన్ను మూడుసార్లు పిలువు. మరుక్షణమే నీ పక్కన వుంటాను. నా పేరు అపూర్వుడు!" అని చెప్పి అపూర్వుడు అక్కడినుంచి వేగంగా వెళ్ళిపోయాడు. —(ఇంకావుంది)








## 3

[సదానందముని తన తపోశక్తితో యజ్ఞంనుంచి సృష్టించిన దివ్యశక్తులు గల అపూర్వుడనే విచిత్రవ్యక్తి ఏనుగుల సహాయంతో మంటలపాలైన పేదల ఇళ్ళను కాపాడాడు. ఆ పిమ్మట, బందిపోటు దొంగలు, తమ దేవతకు బలి ఇవ్వడానికి పట్టుకుపోయిన సమీరుడనే కుర్రవాణ్ణి వాళ్ళనుంచి కాపాడి అతడి గ్రామం పొలిమేరలో తెచ్చి వదిలాడు. —తరవాత]

సమీరుణ్ణి దూరంనుంచి చూడగానే, గ్రామస్థులు పట్టరాని సంతోషంతో అతడి కేసి పరిగెత్తివచ్చారు. సమీరుడి తల్లి, ''వచ్చావా నాన్నా!'' అంటూ పరిగెత్తి వచ్చి అతణ్ణి కౌగలించుకుని ఆనంద బాష్పాలతో ముద్దాడింది.

''ఆ క్రూరులనుంచి ఎలా తప్పించుకున్నావు నాయనా!'' అని అడిగాడు గ్రామాధికారి అతణ్ణి మెచ్చుకోలుగా.

''మన సమీరుడు ధైర్యసాహసాలు గలవాడే కాదు; చాలా తెలివిగలవాడు. అందుకే బందిపోట్ల నుంచి క్షేమంగా తప్పించుకోగలిగాడు,'' అన్నాడు మరొక గ్రామస్థుడు.

ఆ మాటలకు అక్కడున్న మిగతా వాళ్ళందరూ అవును అవును అన్నట్టు తలలూపసాగారు. అయినా సమీరుడు వినయంగా చేతులు జోడించి, ''ఈ రోజు



చావునుంచి తప్పించుకోగలిగానంటే అందుకు నా ధైర్య సాహసాలూ, తెలివితేటలూ కారణాలుకావు. ఆ భగవంతుడే ఒక దివ్యపురుషుడి ద్వారా నా ప్రాణాలు రక్షించాడు. అయినా, నేనొక్కణ్ణి బతికి ఏంప్రయోజనం? బందిపోట్లు మరెందరి ప్రాణాలనో బలిగొంటున్నారు కదా!'' అన్నాడు.

''నువ్వన్నది నిజమే. కాని, ఆ దుర్మార్గుల బారినుంచి కనీసం నువ్వయినా బయటపడగలిగావు. పరమక్రూరులయిన ఆ బందిపోట్లను ఎదుర్కోవడం మనవల్ల సాధ్యమయ్యే పనికాదు. రాజుగారి సైనికులు సైతం ఆ దుర్మార్గులను అణచలేక పోతున్నారుకదా!'' అన్నాడు గ్రామాధికారి విచారంగా.

''దేనికైనా ఒక అంతం వుంటుంది. ఇప్పుడు ఆ దుర్మార్గుల అంతం సమీపిస్తున్నది. అందుకు రాజుగారి సైనికులు కార్యరంగంలోకి దిగాలి. నావెంట వచ్చారంటే బందిపోటు దొంగలందర్నీ పట్టి ఇవ్వగలను.'' అన్నాడు సమీరుడు.

అతడి మాటలకు అందరూ విస్తుపోయారు. ముఖ్యంగా సైనిక దళనాయకుడు, ఆ కుర్రవాడికి మతి చలించిందేమో అని అతణ్ణి ఎగాదిగా వింతగా చూడసాగాడు. అయినా, గ్రామాధికారి సమీరుణ్ణి గురించి బాగా ఎరిగినవాడు కనుక, ఆయన వాణ్ణి ఆప్యాయంగా దగ్గరికి పిలిచి, ''ఇప్పుడు దొంగలు ఎక్కడున్నారో నీకు తెలుసా? ఒకవేళ నువ్వు మమ్మల్ని అక్కడికి వెంటబెట్టుకుని వెళ్ళినా, ఈలోగా వాళ్ళందరూ మరోచోటికి పారిపోగలరు కదా!'' అని అడిగాడు.

''ఒకవేళ బందిపోట్లు అక్కడేవున్నా, స్వల్పసంఖ్యలో వున్న మా సైనికులు, అసంఖ్యాకులైన ఆ దుష్టుల్ని ఎలా పట్టి బంధించగలరు?'' అన్నాడు దళనాయకుడు అనుమానంగా.

''ఆ బందిపోటు దొంగలందరూ ఒక గుహాముఖంలో స్పృహ తప్పి పడిపోయి





వున్నారు. మనం వెళ్ళేవరకు స్పృహ రాదు!'' అన్నాడు సమీరుడు.

''అలాగా!'' అన్న దళనాయకుడి ముఖంలో కొత్త వెలుగు కనిపించింది. సైనికులను తనవెంట రమ్మని ఆజ్ఞాపించి, అతడు సమీరుడి వెంట అడవికేసి బయలు దేరాడు.

''బాబూ, సమీరా! రాత్రంతా ఆకలితో అలమటించి వుంటావు. మళ్ళీ ఎప్పొ డొస్తావో ఏమో. ఇంత తిని వెళ్ళు నాయనా!'' అన్నది సమీరుడి తల్లి.

''అనుకున్న పని పూర్తిచేసుకుని వచ్చాక తృప్తిగా తింటాను. ఆలస్యంచేస్తే వచ్చిన అవకాశం కాస్త చేజారిపోవచ్చు!'' అని చెప్పి సమీరుడు తల్లి వద్ద సెలవు తీసుకున్నాడు.

సమీరుడి వెంట దళనాయకుడూ, అతనివెంట ఆయుధాలు ధరించిన సైని కులూ, వాళ్ళ వెనకగా బాణాకర్రలూ, కత్తులూ పట్టుకున్న దృఢకాయులైన గ్రామస్థులు కొందరితో కలిసి గ్రామాధి కారీ, అడవికేసి బయలుదేరారు.

వాళ్ళందరూ ఎంతో ఉత్సాహంగానూ, మరింత జాగ్రత్తగానూ చాలా దూరం నడిచి అడవిని సమీపించారు. దొంగల స్థావరం సమీపించగానే సమీరుడు, వాళ్ళందరినీ ఒకచోట ఆగమని చెప్పి,



తనుమాత్రం ఎదురుగుండా వున్న ఒక చిన్న కొండఎక్కి అవతలివైపుకు చూశాడు. దొంగలందరూ ఇంకా నిద్ర పోతూనే వున్నారు. సమీరుడు చిన్నగా నవ్వి, దళనాయకుణ్ణీ, గ్రామాధికారినీ కొండపైకి రమ్మని సైగ చేశాడు.

వాళ్ళిద్దరితోపాటు మిగతా వాళ్ళుకూడా ఉత్సాహంగా ఆ చిన్న కొండను ఎక్కి గుహలున్న అవతలివైపు దిగారు. దళ నాయకుడి ఆజ్ఞానుసారం, సైనికులు అక్కడి చెట్లకు అల్లుకుని వున్న బలమైన తీగలను కత్తులతో తెంచి, వాటితో నిద్రపోతూన్న దొంగలందరి చేతులూ వెనక్కు బంధించారు.



మత్తువదలి మొట్టమొదటకళ్ళుతెరిచిన భైరవమల్లు ఎదుట నిలబడిన దళనాయ కుణ్ణి చూడగానే, హడలిపోయాడు.

''దుర్మార్గుడా....ఈ క్షణంతో నీ ఆట కట్టు. లేచి, మర్యాదగా మా వెంట నడిచిరా. తప్పించుకోవాలని చూశావో, ముళ్ళూ, రాయీ, రప్పా అని చూడ కుండా బరబరా లాక్కుపోగలం. కాళ్ళు చేతులు ఊడిపోయినా రాజుకు నీ తలను అప్పగించగలం. జాగ్రత్త!'' అని హెచ్చ రించాడు దళనాయకుడు.

ఒక్క నిమిషం చుట్టుపక్కల కలయ జూసిన భైరవమల్లు, జరిగిన సంగతి గ్రహించిన వెంటనే చేతులకు కట్టిన తీగలను తెంచుకోవడానికి నోటితో కొరకబోయాడు. ఆ క్షణమే దళనాయ కుడు పిటికిలి బిగించి, వాడి నోటి మీద గట్టిగా గుద్ది, ''ఇంకొక దెబ్బతో నీ పళ్ళన్నీ రాలిపోతాయి. పిచ్చిపిచ్చి వేషాలు వేశావో, నిన్నూ, నీ తోటిదొంగలనూ ఇక్కడే హతమార్చగలను. ప్రాణాలపై ఆశవుంటే నేను చెప్పినట్టు లేచినడువు,'' అన్నాడు.

దళనాయకుడి దృఢమైన కంఠస్వరం కొండలలో మారుమోగింది. ఆలోగా భైరవమల్లు ముఠాలోని దొంగలు ఒక్కొక్కరుగా మేలుకుని, తమకు దాపు రించిన దుస్థితిని గ్రహించారు. సైనికులు కొరడాలు ఝుళిపించడంతో, దొంగ లందరూ లేచి నిలబడి బెదురుచూపులు చూస్తూ ముందుకు నడిచారు. వాళ్ళకు ముందూ వెనక ఆయుధాలు ధరించిన సైనికులు నడుస్తున్నారు. దళనాయ కుడూ, సమీరుడూ, గ్రామాధికారీ అందరి కన్నా ముందు నడవసాగారు.

వాళ్ళందరూ సమీరుడి గ్రామం చేరే సరికి, చుట్టుపక్కల గ్రామాల నుంచి, అక్కడ గుమిగూడిన వందలాదిమంది ప్రజలు దొంగలను విచిత్రంగా చూడ సాగారు. దొంగలు తలలు వంచుకుని నిలబడ్డారు. దొంగలు పూర్వం పెట్టిన బాధలు తలుచుకుని, కొందరు







గ్రామస్థులు వాళ్ళను కొట్టబోయారు. కాని, సమీరుడు అడ్డుపడి, ''ఆగండి! ఆగండి! దొంగలు పట్టుబడిపోయారుకదా? రాజు గారు వాళ్ళకు తగిన శిక్ష విధించగలరు. మీరు ఓర్పు వహించండి,'' అన్నాడు.

గ్రామస్థులందరూ, ''సమీరుడికీ జెయ్,'' అంటూ అతణ్ణి భుజాలపైకెత్తుకుని ఉత్సాహంగా గంతులు వేయసాగారు.

గ్రామాధికారి సమీరుడికీ, దళనాయకుడికీ, సైనికులకూ విందు ఏర్పాట్లు చేశాడు. భోజనాలయ్యాక, ఒక చెట్టు నీడలో నిలబడిన సమీరుడికి ఎవరో మెల్లగా ఈలవేయడం వినిపించింది. సమీరుడు ఆ దిక్కుకేసి తిరిగి చూశాడు. ఒక పొదరిల్లు చాటున అపూర్వుడు కనిపించాడు. పట్టరాని ఆనందంతో సమీరుడు అక్కడికి పరిగెత్తబోయి, అపూర్వుడు వద్దని సైగచేయడంతో అలాగే నిలబడ్డాడు. అపూర్వుడు అక్కడున్న విషయం ఎవరికీ తెలియకూడదని ఆయన ఆశిస్తున్నాడని గ్రహించిన సమీరుడు, ఎవరికీ అనుమానం కలగకుండా మెల్లగా పొదరింటిని సమీపించి, అపూర్వుడితో, ''మిమ్మల్ని చూడడం నాకెంతో ఆనందంగా ఉన్నది,'' అన్నాడు.

''బందిపోటు దొంగలను బంధించడానికి నువ్వు చూపిన నేర్పు నాకూ ఆనందం కలిగిస్తున్నది. అయినా, ఎంత దుర్మార్గులయినప్పటికీ దొంగలు కూడా మనుషులే కదా? వాళ్ళకూ ఆకలిదప్పులుంటాయి కదా? వాళ్ళకు తిండి పెట్టమని గ్రామాధికారికి చెప్పు,'' అన్నాడు అపూర్వుడు.

''అలాగే చెబుతాను దేవా!'' అన్నాడు సమీరుడు.

''సమీరా, నన్ను మిత్రమా అని పిలువు. అదేచాలు!'' అన్నాడు అపూర్వుడు చిన్నగా నవ్వుతూ.

• • •

దళనాయకుడు బంధించి రాజధానికి తీసుకువచ్చిన బందిపోట్లకందరికీ రాజు మరణశిక్ష విధించాడు. దొంగల కాళ్ళ



''నీవల్ల మనందరి ప్రాణాలు పోతాయన్న విషయం తప్ప నాకిప్పుడేదీ గుర్తు లేదు. ఇంకా మేము నిన్నెందుకు గౌరవించాలి?'' అని ఆ దొంగ ఎదురుతిరిగాడు.

''నోర్ముయ్. నోరు తెరిచావో ప్రాణాలు తీస్తాను!'' అన్నాడు భైరవమల్లు.

''నీకా కష్టంవద్దు. ఆ పని రాజుగారి భటులే చేస్తారు. మా ప్రాణాలే కాదు. నీ ప్రాణమూ తీస్తారు!'' అన్నాడు దొంగ.

భైరవమల్లు పట్టరాని ఆగ్రహంతో పళ్ళు పటపట కొరికాడు. ఒకడు ఎదురు తిరిగితే, మిగతా దొంగలందరూ మౌనంగా ఊరుకున్నారు. అంటే, వాళ్ళూ ఆ మాటల్ని ఆమోదించినట్టే కదా!

చేతులకు ఇనుపసంకెళ్ళు బిగించి, కారాగారంలో బంధించారు. మరణశిక్ష అమలు జరిగేవరకు ప్రాణాలు పోకుండా దొంగలకు కొద్దిగా తిండి పెడుతున్నారు. కారాగారంలో ఉన్న దొంగలు దిగులుగా ఒకచోట తలలు వంచుకుని కూర్చున్నారు. అప్పుడు ఒక దొంగ, ''భైరవా, నీ కారణంగా నేమాకీ గతి పట్టింది!" అన్నాడు కోపంగా.

''ఏమిటీ నన్ను పేరుపెట్టి పిలవడానికి నీకెన్ని గుండెలు! నేను మీ నాయకుణ్ణి. నిన్నటివరకు పిలిచీ పిలవగానే 'దొరా' అంటూ నా కాళ్ళమీదపడిన సంగతి మరిచిపోయావా?'' అన్నాడు భైరవమల్లు ఆవేశంగా.

''మీకు మరణం నుంచి తప్పించుకోవాలని ఉన్నదా?'' అన్న మధుర కంఠస్వరం ఒక మూలనుంచి వినిపించింది.

దొంగలందరూ ఆ కంఠం వినిపించిన దిక్కుకేసి తిరిగిచూశారు. చీకటిగా ఉన్న ఆ మూలకేసి చూస్తూ భైరవమల్లు, ''ఎవరా మాటలన్నది?'' అని అడిగాడు.

''మీరు పట్టుబడడానికి కారణమైన వాణ్ణి!'' అన్నది కంఠస్వరం.

''మేము పట్టుబడడానికి కారణమైన వాడివయితే, మరి ఇప్పుడెందుకు మమ్మల్ని కాపాడాలనుకుంటున్నావు?'' అని అడిగాడు భైరవమల్లు.



''నేరస్థులు మరణించడం నాకిష్టం లేదు. తప్పుచేసినవాళ్ళలో మార్పు వస్తే చూసి ఆనందిస్తాను. పాప భూయిష్టమైన బతుకులను సాగిస్తూ, ఎదుటి వారికి దుఃఖం కలిగిస్తూ, మిమ్మల్ని మీరే నాశ పరచుకుంటున్నారు. అటువంటి జీవితం నిరర్థకం కాబట్టి మిమ్మల్ని రాజు గారి సైనికులకు పట్టి ఇచ్చాను. ఇకపై మంచి మార్గంలో పయనిస్తామని మాట ఇచ్చా రంటే రాజుగారికి మీ మొర వినిపించి మీకు క్షమాభిక్ష ఇప్పిస్తాను,'' అన్నాడు అపూర్వుడు చీకటిలోంచి.



దొంగలు కొంతసేపు మౌనం వహిం చారు. ఆ తరవాత అందరూ ఏక కంఠంతో, ''మామీద కరుణించి మమ్మల్ని ఉరి శిక్ష నుంచి రక్షించు. ఈ క్షణంనుంచి నీఆజ్ఞాను సారం మంచి మార్గంలో పయనిస్తాము,'' అన్నారు.

''భైరవమల్లు అభిప్రాయం ఏమిటి?'' అని అడిగాడు అపూర్వుడు.

భైరవమల్లు దీర్ఘంగా నిట్టూర్చి, ''నేనూ ఒకప్పుడు సంతోషకరమైన శాంతియుత జీవితం గడపాలనే ఆశించాను. అయినా, క్రమేణా పరులను పీడించే పాప జీవి తానికి అలవాటు పడిపోయాను. ఇప్పుడు నువ్వు కాపాడావంటే జీవితాంతం నీ సేవ లోనే గడుపుతాను,'' అన్నాడు.

''నా సేవలో కాదు; ఆత్మ సేవలో జీవితాలు గడపండి. ఆత్మసేవలో, అంటే ధర్మ మార్గంలో పయనించే వాళ్ళకు ఓటమి, అశాంతి వుండవు,'' అన్నాడు అపూర్వుడు.

''నాకు ఏమైనా ఫరవాలేదు. రాజుగారు వీళ్ళందరినీ క్షమించి వదిలిపెట్టి, నన్ను ఉరితీయించినా సంతోషిస్తాను,'' అన్నాడు భైరవమల్లు.

''నీలో వచ్చిన మంచి మార్పుకు నీ మాటలే నిదర్శనం. మీ గురించి రాజు గారికి తెలియజేస్తాను. అంతవరకు మీరు దైవప్రార్థనలు జరపండి. మీ అపరాధా లను క్షమించమని దేవుణ్ణి మనసారా

ప్రార్థించండి. ఆ దేవుడే మిమ్మల్ని రక్షించగలడు!'' అన్నాడు అపూర్వుడు.

* * *

మంచి మార్గంలోకి వస్తామని మాట ఇచ్చిన బందిపోట్లను క్షమించి వదలమని, సమీరుడు అపూర్వుడి మాటగా రాజుకు తెలియజేశాడు. కాని రాజు అందుకు అంగీకరించకుండా, ''ఆ దుర్మార్గులు అన్నెం పున్నెం ఎరుగని ప్రజలను చంపిన పరమ కిరాతకులు. వాళ్ళకు మరణశిక్ష విధించడమే న్యాయం!'' అన్నాడు.

''మహారాజా! ఆ దేవుడే వాళ్ళను క్షమించినట్టు నేను భావిస్తున్నాను,'' అన్నాడు సమీరుడు.

''అలాగా, అయితే నువ్వాదేవుడి ప్రతినిధివన్న మాట!'' అన్నాడు రాజు పరిహాసంగా.

''నేను దేవుడి ప్రతినిధిని కాను కాని, నన్ను దొంగల నుంచి రక్షించిన దివ్య పురుషుడి ద్వారా దేవుడి మాటలను వింటున్నాను,'' అన్నాడు సమీరుడు.

''శభాష్, ఆ దేవుడే వాళ్ళను రక్షించాలనుకున్నప్పుడు, ఏదైనా అద్భుతం చూపి రక్షించుకోవచ్చుకదా?'' అన్నాడు రాజు.

''దొంగలు ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నారు. పరమక్రూరులయిన వాళ్ళలో మానసిక పరివర్తన రావడమే ఒక మహా అద్భుతం కాదా?'' అన్నాడు సమీరుడు వినయంగా.

రాజు గట్టిగా నవ్వుతూ, ''నిజమే కావచ్చు! కాని నాకు మాత్రం అది చాలదు. ఆ దేవుడే భైరవమల్లును కాపాడాలని సంకల్పించాడు కదా! మరి నన్నడగడమెందుకు? వాణ్ణి ఉరితీసే తాటిని, ఒక మెరుపువంటి అగ్నిజ్వాలను పంపి ఛేదించవచ్చుకదా?'' అన్నాడు.

సమీరుడు నిరుత్సాహంతో వెనుతిరిగి వెళ్ళి, జరిగిన సంగతిని అపూర్వుడికి చెప్పాడు.

''రాజు చూడాలనుకున్న అద్భుతం తప్పక జరిగి తీరుతుంది!'' అన్నాడు అపూర్వుడు. —(ఇంకావుంది)






## 4

[అపూర్వుడు సమీరుడనే కుర్రవాణ్ణి, బందిపోట్ల నుంచి రక్షించాడు. అపూర్వుడి ఆదేశాను సారం, సమీరుడు, దొంగలను సైనికునికులకు పట్టి ఇచ్చాడు. రాజు వాళ్ళకు మరణశిక్ష విధించాడు. తమ పాపకృత్యాలకు పశ్చాత్తాపం చెందిన దొంగలను క్షమించమని అపూర్వుడి మాటగా సమీరుడు రాజుకు చెప్పాడు. కాని, రాజు అందుకు అంగీకరించలేదు. —తరవాత]

బందిపోట్లను బంధించిన కారాగార గృహంలోని చీకటి గదిలో భయంకరమైన నిశ్శబ్దం అలముకున్నది. ఒక దొంగ మూలుగుతూ, "రాజుగారు మనల్ని నిజంగానే క్షమించగలరని, అనుకుంటున్నావా?" అని పక్కన కూర్చున్నవాణ్ణి అడిగాడు.

"ఆ దేవుడు కరుణిస్తే తప్ప. మనం చావు నుంచి తప్పించుకోలేము," అన్నాడు పక్కవాడు మరింత దీనంగా.

వాళ్ళ మాటలు విన్న భైరవమల్లు, "ఎందుకలా పిరికిపందల్లాగా ఏడుస్తారు?" అన్నాడు కోపంగా.

"పిరికిపందలు! పిరికిపనులు కాక పోతే మనం ఇన్నాళ్ళు చేసిన పనులు సాహసకృత్యాలా? నిరాయుధులయిన అమాయక బాటసారుల మీద పడి దోచు కోవడం; నిస్సహాయులయిన పసిబిడ్డలను పట్టుకుపోవడం; అడ్డుకోలేని బలహీనుల







పైబడి, బాధించి హడలగొట్టడం ఇటువంటి పనులను పిరికివాళ్ళు కాక ఇంకెవరు చేయగలరు? ఎవళ్ళో కష్టపడి సంపాయించిన ధనాన్ని అపహరించి, దాంతో మనం ఆనందంగా బతుకులు సాగించామే, అంతకన్నా సిగ్గులేని కృత్యం ఏమిటి? అయినా, మాకీ పిరికితనం నేర్పిందెవరు? నువ్వేకదా? ఆ సంగతే మరిచిపోయావా?'' అన్నారు దొంగలు.

వాళ్ళ ప్రశ్నలకు భైరవమల్లు సమాధానం చెప్పలేక మౌనంగా ఊరుకున్నాడు.

అప్పుడు, అంతకు పూర్వం వాళ్ళకు వినిపించిన అపూర్వుడి మధుర కంఠస్వరం మళ్ళీ వినిపించింది: ''మీరందరూ అభంశుభం ఎరుగని పసిబిడ్డల్లా మాట్లాడుతున్నారేమిటి? నేరమంతా భైరవమల్లు మీదికి తోసి, ఇంకా మిమ్మల్ని మీరే మోసం చేసుకోకండి. మీరు తెలిసే నేరాలు చేసినవాళ్ళు. మీ తప్పులకు మీరే బాధ్యులు. కాబట్టి మీరు శిక్షార్హులు!''

ఆ మాటలు విన్నాక ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

కొంతసేపయ్యాక భైరవమల్లు, మాటలు వినిపించిన దిక్కుకేసి చూస్తూ, ''దేవా! నువ్వు మమ్మల్ని నిజంగానే రక్షించగలవా? మమ్మల్ని ఉరితీసే రోజు ఫలానా అని నిర్ణయించినట్లు కారాగారగృహ రక్షకభటులు చెబుతున్నారు!'' అన్నాడు.

''నిర్మలమైన మనస్సులతో, దేవుణ్ణి ప్రార్థించండి. మంచి మనసులకు తప్పక మేలేజరుగుతుంది!'' అన్నాడుఅపూర్వుడు.

* * *

ఇన్నాళ్ళు పట్టిపీడించిన బందిపోట్ల బెడద ఈ రోజుతో విరగడవుతుందని ప్రజలందరూ పట్టరాని ఆనందోత్సాహాలతో ఉన్నారు. బందిపోట్లను సూర్యోదయానికల్లా ఉరి తీయాలని ప్రకటించారు.

తెల్లవారకముందే పట్టణప్రజలు, వధ్యస్థానం సమీపంలో గుంపులు గుంపులుగా చేరారు. మరికొందరు కారాగార గృహం నుంచి, వధ్యస్థానం వరకు గల బాటకు







ఇరువైపులా బారులుతీరి నిలబడ్డారు. కొత్వాలు ఒక గుర్రం మీద ముందుగా బయలుదేరాడు. ఆయన వెనక సైనికులు, చేతులు బంధించిన దొంగలను వధ్య స్థానం కేసి నడిపించారు. దొంగలకు ముందూ, వెనకా, ఇరువైపులా ఆయుధాలు ధరించిన సైనికులు నడుస్తున్నారు.

దారికి ఒక వైపున నిలబడి వాళ్ళను చూస్తున్న జనం నుంచి, ఒక స్త్రీ హఠాత్తుగా ముందుకు దూకి, "హంతకుడా, పాతకుడా!" అంటూ భైరవమల్లు ముఖం మీదకొట్టి, "నా భర్త స్నేహితులతో కలిసి, దూరప్రాంతాలకు వెళ్ళి, ధనంతో తిరిగి వస్తూండగా ఈ దుర్మార్గులు డబ్బు మూటను కాజేయడానికి చూశారు. కాని నా భర్త, చేతిలోని కర్రతో ఈ దుర్మార్గుల చేతులు విరగ్గొట్టాడు. దాంతో బెదిరిపోయి పారిపోయిన ఈ పిరికిపందలు, కొంత సేపటికి దొంగచాటుగా వచ్చి, వెనక నుంచి నా భర్తను చంపి, దగ్గరున్న ధనం దోచుకుపోయారు!" అని నెత్తీ నోరు బాదుకుని ఏడ్వసాగింది.

ఆమె మాటలు విని రెచ్చిపోయిన కొందరు ప్రజలు భైరవమల్లును కొట్టబోయారు. దానిని గమనించిన కొత్వాలు, గుర్రాన్ని వెనక్కు మళ్ళించి, "మీ బాధ, చెప్పరానిదే. మీ ఆగ్రహం న్యాయమైనదే. కాని, తాము చేసిన ఘోరాలన్నిటికీ ఫలితంగా, మరణశిక్ష అనుభవించడానికి వెళుతూన్న ఈ దొంగల మీద ఈ సమయంలో పగ సాధించడానికి పూనుకోవడం భావ్యం కాదు. ఓర్పు వహించండి," అని హెచ్చరించాడు.

భైరవమల్లు చేతులు పైకెత్తి కన్నీళ్ళతో, "తల్లీ, నేను పాపాత్ముణ్ణే. అందులో సందేహం లేదు. నీ భర్తనే కాదు. ఈ లోకంలో అనేకమంది భర్తలనూ, తండ్రులనూ, కొడుకులనూ చంపినపరమ కిరాతకుణ్ణి. మీరు నన్ను క్షమించినా, ఆ దేవుడు నన్ను శిక్షించకమానడు. నాకు నరకం తప్పదు," అన్నాడు దీనస్వరంతో.







ఆ మాటలు విని ప్రజలు శాంతించారు. భైరవమల్లును చెంపదెబ్బకొట్టిన స్త్రీ కూడా బాధగా నిట్టూర్చింది.

కొత్వాలు, భైరవమల్లు కేసి తిరిగి, "ఇప్పుడు మీరు చేసిన తప్పుకు పశ్చాత్తాప పడుతున్నారు. అయితే, మీరు చేసిన నేరాలు క్షమించరానివి. మీరు ప్రాణం తీయడానికి పూనుకున్న సమీరుడే, మీ ప్రాణాలు రక్షించాలని రాజుగారిని ప్రార్థించాడు. కాని, మీ దురదృష్టం కొద్దీ రాజుగారు అందుకు అంగీకరించలేదు!" అన్నాడు కొత్వాలు.

"ఏమీ చేయలేమని నాకు తెలుసు. పాపాత్ముడనైన నాకు మరణం తప్పదు. కాని, నా తోటివాళ్ళు చేసిన పాపాలన్నిటికీ కారణం నేను. అందువల్ల వాళ్ళను వదిలిపెట్టి నన్ను చిత్రవధ చేసి చంపండి. వందసార్లయినా మరణించడానికి నేను సిద్ధంగా ఉన్నాను," అన్నాడు భైరవమల్లు.

ఆ మాటలకు కొత్వాలు నవ్వి, "రాజుగారి తీర్పుకు తిరుగులేదు. తీర్పును పునః పరిశీలన చేయమని ప్రార్థించడానికి సమయం దాటిపోయింది. మీలో లేనిపోని ఆశలు కలిగించలేను. మీరందరూ ఉరి కంబం ఎక్కక తప్పదు," అన్నాడు.

అందరూ వధ్యస్థానం సమీపించారు. దాదాపు ఇరవైమంది వరకు వున్న దొంగలందరినీ, ఎత్తుగా వున్న మట్టిదిబ్బ మీదికి నడిపించారు. మట్టిదిబ్బ మీద ఉరి కంబం ఉన్నది. ఉరి కంబం మధ్య నుంచి ఉరితాడు వేలాడుతున్నది! కొత్వాలు కటికవాణ్ణి, "అంతా సిద్ధమే కదా?" అని అడిగాడు.

"సిద్ధం,ప్రభూ!" అన్నాడుకటికవాడు.

"భైరవమల్లును మొదట ఉరి తీయాలి. ఆ తరవాత మిగతావాళ్ళు!" అన్నాడు కొత్వాలు.

ఇద్దరు భటులు భైరవమల్లును ఉరి కంబం దగ్గరికి తీసుకు వెళ్ళారు.

"భైరవా, నీ ఆఖరి ప్రార్థన ఏదైనా వుంటే కానీ," అన్నాడు కొత్వాలు.





ఖైరవమల్లు చేతులు జోడించి, ''నావల్ల కష్టాలపాలైన వాళ్ళకందరికీ క్షమాపణలు చెప్పుకుంటున్నాను. నా పాపాలన్నిటినీ క్షమించి రక్షించమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను,'' అన్నాడు.

కటికవాడు ఖైరవమల్లును ఉరికంబం మధ్య నిలబెట్టి, వాడి గొంతుకు ఉరితాడు తగిలించాడు.

మట్టిదిబ్బకు దిగువ నిలబడిన జనం నిశ్శబ్దంగా, ఊపిరులు బిగబట్టుకుని చూస్తున్నారు.

కొత్వాలు కటికవాడితో, ''నేను ఒకటి నుంచి పదివరకు లెక్కపెడతాను. పది అనగానే నువ్వు తాడును లాగాలి. సరేనా!'' అన్నాడు.

"చిత్తం ప్రభూ!" అన్నాడు కటికవాడు.

కొత్వాలు నెమ్మదిగా ఒకటీ, రెండూ అని లెక్కించడం మొదలు పెట్టాడు.

అక్కడ చేరిన జనం ఒకవైపు భయం, మరొకవైపు ఉత్సాహంతో చూస్తున్నారు.

సూర్యోదయమై లేత ఎండ ఉరికంబం మీద పడుతున్నది. బలమైన ఉరితాటికి నూనె రాసినట్టున్నది. అందువల్ల అది సూర్యకిరణాలకు తళతళ మెరుస్తున్నది.

''ఎనిమిది!'' అన్నాడు కొత్వాలు.

కటికవాడి చేతులు తాటిని గట్టిగా బిగించి పట్టుకున్నాయి.



''తొమ్మిది!'' అన్నాడు కొత్వాలు ఎంతో గంభీరంగా.

ఉరికంబం పక్కన అర్ధవృత్తాకారంలో నిలబడిన దొంగలు ఏడవసాగారు.

''పది!''

భటుడు బలంగా తాటిని లాగాడు. ఆ ఊపుకు ఖైరవమల్లు శరీరం పైకి వెళ్ళవుండాలి. కాని, అలా జరగలేదు. పైగా, ఉరితాడు ఉచ్చుకు పైన కాస్త తెగిపోయింది!

"ఏమిటది?" అని అరిచాడు కొత్వాలు.

కటికవాడు నోరు తెరవలేకపోయాడు. వాడు ఎందరినో ఉరి తీశాడు. ఇటువంటి సంఘటనఅంతకుముందెన్నడూజరగలేదు







అంతవరకు దిబ్బకు దిగువ నిలబడిన ముగ్గురు రాజోద్యోగులు దిబ్బ మీదికి వచ్చి, "తాడు గట్టిగా వుందో లేదో చూశావా, లేదా ?" అని అడిగారు.

"క్షుణ్ణంగా పరిశీలించి చూశాను," అన్నాడు కటికవాడు.

"ఆలస్యం దేనికి ? మరొకసారి ఉరి తియ్ !" అని ఆజ్ఞాపించాడు కొత్వాలు.

కటికవాడు కొత్త తాడు తెచ్చి, రాజోద్యోగులకు చూపి, పరిశీలించిన తరవాత, కంబానికి కట్టి, ఉరి తాటిని భైరవమల్లు మెడకు బిగించి, కొత్వాలు మునుపటిలా 'పది' అనగానే మళ్ళీ తాడును లాగాడు.

మళ్ళీ ఉరితాడు పుటుక్కున తెగి పోయింది !

ఆ వింతను చూసి ఆశ్చర్యంతో, ఎవరూ మాట్లాడలేకపోయారు. కొంతసేపయ్యాక కొత్వాలు, "ఇదేదో మానవాతీతమైన అద్భుతశక్తి ద్వారానే ఇలా జరుగుతున్నది ! ఈ సంగతిని రాజుగారికి తెలియజేయాలి. ఇప్పుడే తిరిగి వస్తాను. నేను వచ్చేలోగా మరొక తాటిని సిద్ధం చేయండి," అని చెప్పి, గుర్రం మీద బయలుదేరాడు.

కొంతసేపటికి, కొత్వాలు రాజూ, మంత్రీ, సేనాధిపతులతో సహా వధ్యస్థానానికి వచ్చాడు.

రాజు స్వయంగా తాడును పరిశీలించి చూశాడు. ఆ తరవాత కటికవాడు ఉచ్చు వేసి భైరవమల్లు మెడకు తగిలించాడు.

కొత్వాలు యథాప్రకారం, ఒకటీ, రెండూ అని ప్రారంభించి, పది అనగానే ఉరితాడు ఫట్‌మని తెగింది !

ఆ వింతను మూడోసారి చూసిన ప్రజలు ఆశ్చర్యంతో 'ఆహా' అని కేక వేశారు.

రాజు కొంతసేపు మౌనం వహించి, తరవాత తల పంకిస్తూ, "ఎటువంటి కారణమూ లేకుండా, దృఢమైన తాడు వరుసగా మూడుసార్లు ఎలా తెగిపోతుంది ? దీనికి ఏదో బలమైన కారణమే





ఉండాలి. హంతకులయిన ఈ దొంగలను కాపాడాలని సంకల్పించినప్పుడు, ఆ దేవుణ్ణే ఏదైనా అద్భుతం చూపి రక్షించు కోమని, నేను సమీరుడితో అన్నాను. ఆ అద్భుతం నా కళ్ళ ఎదుటే జరిగింది. భైరవమల్లును వదిలిపెట్టండి. వాణ్ణేకాదు; వాడి అనుచరులను కూడా వదలండి. అయితే, వాళ్ళు మన పర్యవేక్షణలో ఇకమీదట పాపరహితమైన నూతన జీవితాలు ప్రారంభించాలి!'' అన్నాడు.

రాజు మాటలు విని, ప్రజలు ఆనందాతిరేకంతో హర్షధ్వానాలు చేశారు.

భటులు, దొంగల కాళ్ళకూ, చేతులకూ తగిలించిన సంకెళ్ళను తొలగించారు. వాళ్ళందరూ రాజు పాదాలపైబడి నమస్కరించారు.

''మీరు కృతజ్ఞత చూపవలసింది, మిమ్మల్ని మరణం నుంచి కాపాడడానికి తన అదృశ్యశక్తిని ప్రదర్శించిన ఆ దేవుడికి. ఆ కరుణామయుడి దయకు పాత్రులయ్యే విధంగా మీ భావిజీవితాలను సక్రమమార్గంలో సరిదిద్దుకోవాలి,'' అని దీవించాడు రాజు.

'మహారాజుకూ జై' అంటూ ప్రజలు జయజయ ధ్వానాలు చేశారు.

* * *

అరణ్య ప్రాంతంలో ఏకాంతంగా కూర్చున్న అపూర్వుడికి నమస్కరించి, ''ఆ అద్భుతం ఎలా సాధ్యమయింది?'' అని అడిగాడు సమీరుడు.

''వేగంగా పరిగెత్తినప్పుడు, ఒక స్థాయికి చేరగానే నేను, ఎదుటివారికి కనిపించకుండా గాలిలో గాలిగా కలిసి పోతాను. తగిన దూరంలో నిలబడి, కొత్వాలు 'ఐదు' అని అన్నప్పుడు పరిగెత్తుకుంటూ వధ్యస్థానాన్ని సమీపించే సరికి వేగం పెరిగి అదృశ్యమయ్యేశక్తిని పుంజుకుని, గాలిలో కలిసిపోయి, పది అనగానే చేతిలోని కత్తితో ఉరి తాడును తెగవేసి, మళ్ళీ వెనుదిరిగి వెళ్ళి, యథాస్థానం చేరుకునేవాణ్ణి,'' అని వివరించాడు అపూర్వుడు. —(ఇంకావుంది)





# అపూర్వుడి సాహసయాత్రలు

## 5

[సదానందముని సృష్టించిన అపూర్వు డనే విచిత్రవ్యక్తి, మంటలపాలైన పేదల గుడిసెలను ఏనుగుల సహాయంతో రక్షించాడు. ఆ తరవాత సమీరు డనే కుర్రవాణ్ణి, బందిపోట్ల నుంచి కాపాడి, దొంగలను, సైనికులకు అప్పగించాడు. చేసిన పాపాలకు పశ్చాత్తాప పడి మంచి మార్గంలో పయనిస్తామని మాట ఇచ్చిన దొంగలను మరణశిక్ష నుంచి రక్షించాడు.—తరవాత]

"నాయనా, నీ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించావు. చాలా సంతోషం." అని, తన దగ్గరికి వచ్చి నమస్కరించిన అపూర్వుణ్ణి ఆప్యాయంగా దీవించాడు సదానందముని.

"ఈ ప్రపంచంలో అడుగుపెట్టిన క్షణం నుంచి, ఒక సమస్య తరవాత మరొక సమస్యను పరిష్కరించడంతోనే కాలం గడిచిపోయింది. ఈ ప్రపంచాన్ని నింపాదిగా చూసి ఆనందించాలన్నది నా కోరిక," అన్నాడు అపూర్వుడు.

"తప్పక చూడు నాయనా! అయితే నువ్వు ఎక్కడికి వెళ్ళినా, అక్కడి పరిస్థితులు నిన్ను కార్యాచరణకు ప్రేరేపిస్తాయి. ప్రపంచం ఆనందనిలయంగా ఉండాలన్నదే భగవంతుడి సంకల్పం. కాని మానవులు తమ స్వార్థంకొద్దీ, దురాశకొద్దీ దీనిని శోకమయం చేస్తున్నారు. సంతో







షంగా ఉండాలంటే మంచి మనసు కావాలి. అది సిద్ధించేంతవరకు మనిషి తప్పులు చేస్తూ, దానికి తగ్గ బాధలు అనుభవిస్తూ గుణపాఠాలు నేర్చుకుంటూ ముందుకు సాగక తప్పదు. నాయనా, నువ్వు ప్రపంచాన్ని దర్శించడానికి వెళ్లిరా. అయితే, చెడుమార్గంలో నడిచేవారిని మంచిమార్గంలోకి మళ్ళించడానికి ఏమాత్రం వెనకాడకూడదు. నిజానికి నువ్వు చెడును చూస్తూ ఊరుకోలేవు కూడా! అది నీ సహజగుణం! వెళ్ళిరా నాయనా,'' అన్నాడు సదానందముని.

అపూర్వుడు మునికి భక్తితో నమస్కరించి, మంచుకొండలపైనుంచి, మైదానాలలోకి పరిగెత్తాడు. వేగం పుంజుకోగానే అతడు అదృశ్యమైపోయాడు.

* * *

సాయంకాలమై చీకటి పడుతూన్న సమయంలో, దీపాలకాంతి అపూర్వుడి దృష్టిని ఆకర్షించింది. అది రత్నపురి రాజధానీ నగరం. విశాలమైన ప్రధాన వీధిలో ప్రజలు గుమిగూడి ఉన్నారు. అపూర్వుడు మెల్లగా వెళ్ళి జనం మధ్య నిలబడ్డాడు. అతణ్ణి ఎవరూ గమనించలేదు.

ఇద్దరు రాజభటులు దండోరా వేసి, ''రత్నపురి ప్రజలకు ఒక ముఖ్యమైన ప్రకటన: రాజుగారి ఏకైక కుమార్తె మన యువరాణి కొంతకాలంగా వ్యాధిగ్రస్తురాలై వున్న సంగతి మీకు తెలుసు. రాజవైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా వ్యాధి నయం కాలేదు. కాబట్టి యువరాణి వ్యాధి నయం చేసిన వారిని, వాళ్ళ ఎత్తు బంగారంతో సత్కరిస్తామని రాజుగారు తెలియజేస్తున్నారు!'' అని చాటింపువేశారు.

ఆ చాటింపు విన్న ప్రజలు కొందరు తమలో తాము ఏవో మాట్లాడుకుంటూ, మరి కొందరు విషాద వదనాలతో మౌనంగా ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఇద్దరు మాత్రం అక్కడే ఆగిపోయారు. అందరికీ విషాదం కలిగించిన ఆ వార్తను విని ఆ ఇద్దరు మాత్రం ఎంతో ఆనందంగా కనిపించా[illegible]



"ఈ చాటింపు కోసమే నేనింతకాలం ఎదురుచూస్తున్నాను," అన్నాడు ఆ ఇద్దరిలో పొడవాటి వాడు నవ్వుతూ, తన మొన దేలిన గడ్డాన్ని మునివేళ్ళతో దువ్వుతూ. వాడు నల్లటి తలపాగా చుట్టుకున్నాడు. వాడి కళ్ళు త్రాచుపాము కళ్ళులాగా మెరుస్తున్నవి.

"స్వామీ, యువరాణి వ్యాధి నయం చేయడానికి వెళ్ళే ముందు పీకలవరకు భోజనంచేసి మరీ వెళ్ళండి. ఎంతఎక్కువ బరువుంటే అంత బంగారం మనదవుతుంది. ఏమంటారు? ఎలా వుంది మన ఆలోచన!" అన్నాడు పొట్టివాడు. వాడికి పెద్ద పెద్ద మీసాలున్నాయి.

"బ్రహ్మాండమైనఆలోచనే కుంభాండా! కాదనను. కాని, నీ గురువు, మహా మాంత్రికుడైన ఈ సర్పకేతుడు నీకన్నా తెలివైనవాడు! కేవలం బంగారంకోసమే నేనీ పథకం వేశాననుకుంటున్నావా?" అని అడిగాడు సర్పకేతుడు.

"దేనికోసం మరి?" అని అడిగాడు కుంభాండుడు.

"నీ గురువు, ఈ రాజ్యానికే గురువు కాబోతున్నాడు!" అన్నాడు సర్పకేతుడు.

"అంటే ప్రజలందరూ తమ శిష్యులయిపోతారన్న మాట!" అన్నాడు కుంభాండుడు.



"మూర్ఖుడా! నువ్వొక్కడివే నా శిష్యుడివి! కాని ఈ రాజ్య ప్రజలందరూ నా ప్రజలవుతారు. అంటే నాచేత పాలింపబడతారు. అర్థమయిందా?" అని అడిగాడు సర్పకేతుడు.

కుంభాండుడు అర్థం కాలేదన్నట్టు తల గోక్కున్నాడు.

"చెబుతాను విను. రాజుకు ఒక్కగానొక్క కూతురు మన యువరాణి, అవునా?" అని అడిగాడు సర్పకేతుడు.

"అవును, స్వామీ!" అన్నాడు కుంభాండుడు.

"రాజు నన్ను తన అల్లుడుగా స్వీకరిస్తానంటేనే నేను యువరాణి వ్యాధి నయం







చేస్తానంటాను. యువరాణిని పెళ్ళాడాక నేనే కదా రత్నపురి సింహాసనానికి వారసుణ్ణి!'' అని పకపకా నవ్వసాగాడు సర్పకేతుడు.

''అహా! గొప్ప ఆలోచన!'' అన్నాడు కుంభాండుడు అమితాశ్చర్యంతో.

''గొప్పవాళ్ళ నుంచి గొప్ప ఆలోచనలే వస్తాయి. ఇప్పుడు నా మాట జాగ్రత్తగా విను. రాజుతో నేను ఈ విషయంలో బేర మాడలేను. దానిని కూడా ఉపాయంతోనే సాధించుకోవాలి. నువ్వు వెళ్ళి రాజును దర్శించి, మానవుల బాధలకు పరిష్కారం సూచించే దివ్య వటవృక్షం ఒకటి అరణ్యంలో ఉందని చెప్పు. రేపు అర్ధరాత్రివేళకు రాజు అరణ్యానికి రావాలి. నేను చెబుతూన్న వటవృక్షం అరణ్యంలో ఎక్కడున్నదో నీకు తెలుసు కదా?'' అని అడిగాడు సర్పకేతుడు.

''తెలుసు, స్వామీ! అరణ్యంలోని నదీ తీరంలో, ఒకవైపున పెద్ద పుట్ట, మరొక వైపున పాడుపడిన శిథిలాలయం మధ్య వున్న వటవృక్షమే కదా! తమరొకసారి ఆ వటవృక్ష బిలంలో దాక్కుని, ఒక వ్యాపారిని బెదరగొట్టారుకదా? ఆ వ్యాపారి హడలిపోయి, డబ్బు మూటను అక్కడే వదలి పారిపోయాడు కదా!'' అన్నాడు కుంభాండుడు.

''సరిగ్గా జ్ఞాపకం వుంచుకున్నావు. ఆ వృక్షం ఎక్కడున్నదో రాజుకు స్పష్టంగా వివరించి చెప్పు. ఆ పిమ్మట నువ్వు రాజుకు ముందే బయలుదేరి వచ్చి, ఆయన అరణ్యానికి వచ్చేలోగా, వటవృక్ష బిలంలో దాక్కో. రాజు వచ్చి, వృక్షానికి నమస్కరించి, తన బాధ తెలియజేస్తాడు. అప్పుడు నువ్వు గంభీర కంఠస్వరంతో రాజుకు సలహా ఇవ్వాలి!'' అన్నాడు సర్పకేతుడు.

''ఏమని సలహా ఇవ్వమని ఆజ్ఞ?'' అని అడిగాడు కుంభాండుడు.

''దాపుల నున్న శిథిలాలయంలో ఒక పవిత్ర సాధువు నివసిస్తున్నాడు. నీ కుమార్తెను ఆ సాధువుకిచ్చి వివాహంచేసే





ఆమె వ్యాధి నయమవుతుంది. ఆ మహా పురుషుడే నీ కుమార్తె వ్యాధి పోగొడతాడు. వివాహం చేయించకపోయావో ఆమె మరణించక తప్పదు—అని చెప్పు. ఆ మాటలు నమ్మి రాజు, నాదగ్గిరికి వచ్చి నన్ను రాజధానికి తీసుకువెళతాడు. రాజభవనంలో నేను యువరాణిని పెళ్ళాడి ఆమె వ్యాధిని నయంచేస్తాను,'' అన్నాడు సర్పకేతుడు.

''ఉదయం తులసీదళాల రసం, సాయంకాలం బిల్వదళాల రసం సేవిస్తే యువరాణి వ్యాధి నయమైపోతుందనేకదా తమరు చెప్పారు. మరి నేను మీ శిష్యుడిగా వెళ్ళి ఆమాత్రం ఇవ్వలేనా? వ్యాధి నయమయ్యాక మీరు వచ్చి దర్జాగా యువరాణిని వివాహమాడవచ్చు కదా? దాంతో మన మిద్దరం కూడా రాజకుటుంబంతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోవచ్చు కదా?'' అన్నాడు కుంభాండుడు.

''మరీ అంతపెద్ద ఆశలు పెంచుకోకు శిష్యా! ఎలాగూ నేను రాజయ్యాక నిన్ను....,'' అని సర్పకేతుడు ఇంకేదో చెప్పబోయేంతలో, ''మంత్రిని చేస్తారు కదూ,'' అన్నాడు, కుంభాండుడు.

''కాదు, నిన్ను నా అంతరంగిక సలహాదారుగా చేసుకుంటానని ఎప్పుడో చెప్పాను కదా?'' అన్నాడు సర్పకేతుడు.




కుంభాండుడు విచారంగా తల వంచుకున్నాడు.

''వెంటనే రాజభవనానికి వెళ్ళి, పని పూర్తిచేసుకుని రా! నేను శిథిలాలయంలో నీకోసం కాచుకుని వుంటాను!'' అంటూ అక్కడినుంచిబయులుదేరాడుసర్పకేతుడు.

వాళ్ళ మాటలు విని అపూర్వుడు ఆగ్రహం చెందాడు. సర్పకేతుడు మంత్ర ప్రభావంతో యువరాణిని అనారోగ్యం పాలుచేసి, ఇప్పుడు వ్యాధి కుదిర్చే సాకుతో, ఆమెను పెళ్ళాడి రాజ్యాధికారాన్ని చేపట్టాలని పథకం వేశాడు!

అపూర్వుడు సర్పకేతుణ్ణి వెంబడించి వెళ్ళాడు. వాళ్ళు చెప్పుకున్న అరణ్యమూ,







వటవృక్షమూ రత్నపురికి ఎంతో దూరంలో లేవు. మాంత్రికుడు శిథిలాలయంలో మానవ కపాలాలనూ, రకరకాల జంతు చర్మాలనూ, రంగురంగుల పొడులనూ, సేకరించి దాచి వుంచాడు. రాత్రి తొలిజాము గడిచిన తరవాత, కుంభాండుడు అక్కడికి వచ్చి, "స్వామీ మీరు ఆజ్ఞాపించిన విధంగానే రాజుగారికి చెప్పాను. రేపు అర్ధరాత్రికి, రాజుగారు ఒంటరిగా ఈ వృక్షం దగ్గరికి రాగలరు!" అన్నాడు.

"శభాష్, చాలా సంతోషం! చెట్టు తొర్రలో కూర్చుని రాజుగారిని ఏమని హెచ్చరించాలో జాగ్రత్తగా మననం చేసుకో. నేను చెప్పినదానికి ఒక్క మాట ఎక్కువగాని, తక్కువగాని ఉండకూడదు. జాగ్రత్త!" అన్నాడు సర్పకేతుడు.

కుంభాండుడు సరే అన్నట్టు తల ఊపాడు.

అమావాస్యరాత్రి ఆకాశం మేఘావృతమై ఉండడంతో అంధకారం అలముకున్నది. రాజు, అంగరక్షకులను దూరంగా వదిలి, అరణ్యంలోని వటవృక్షం కేసి ఒంటరిగా గుర్రం మీద వెళ్ళసాగాడు.

అపూర్వుడు అంతకుముందే పక్క చెట్టెక్కి కూర్చున్నాడు.

రాజు రావడానికి ఒక గంటసేపు ఉందనగా, సర్పకేతుడు, కుంభాండుడికి రాజు రాగానే ఏం చెయ్యాలో చెప్పాడు. కుంభాండుడు వటవృక్షం ఎక్కి దాని తొర్రలో దాక్కున్న తరవాత, సర్పకేతుడు శిథిలాలయం లోకి వెళ్ళిపోయాడు.

రాజు గుర్రం దిగి, వటవృక్షాన్ని సమీపించి, మోకాళ్ళపై కూర్చుని, భక్తితో నమస్కరించి, తన కుమార్తె వ్యాధి గురించి చెప్పి, "పవిత్రవృక్షమా! నా మీద కరుణించి, నా కుమార్తె వ్యాధి తీరే మార్గం చెప్పు." అని ప్రార్థించాడు.

"రాజా నిన్ను నేను కరుణిస్తున్నాను!" అన్నాడు చెట్టు తొర్రలో నుంచి కుంభాండుడు గంభీరంగా.





"ధన్యుణ్ణయ్యాను. నా బిడ్డ వ్యాధి నయమయ్యే మార్గం ఏమిటి తల్లీ?" అని అడిగాడు రాజు.

"పక్కనున్న శిథిలాలయానికి వెళ్ళు. అక్కడొక మాంత్రికుడు ఉన్నాడు. ఆ నీచుడే నీ కుమార్తె అనారోగ్యానికి కారణం. వాడు మంత్రోచ్చారణ చేయడానికి వీలుకాకుండా, మొదట వాడి నోటిని మూసి, శిరశ్ఛేదం చెయ్: దాంతో యువరాణి వ్యాధి సగం నయమై పోతుంది!"



కుంభాండుడి మాటలు విని అపూర్వుడు అమితాశ్చర్యం చెందాడు. దుర్మార్గుడైన మాంత్రికుడికి తగ్గ దుష్టుడైన శిష్యుడు! తన ద్రోహచర్యను బయటపెట్టే అవకాశం లేకుండా, సర్పకేతుడి నోరును మూయమన్న కుంభాండుడు నిజంగానే తెలివి గలవాడనిపించింది అపూర్వుడికి.

రాజు వృక్షానికి మూడవసారిగా నమస్కరించి, "దివ్యవృక్షమా, ధన్యవాదాలు! దయతలచి నా కుమార్తె మిగతా సగం వ్యాధి నయమయ్యే మార్గాన్ని కూడా సూచించు తల్లీ!" అన్నాడు రాజు.

కుంభాండుడు ఇప్పుడు ఏం చెబుతాడో అని అపూర్వుడు ఆసక్తిగా వినసాగాడు.

"రేపు తెల్లవారే సమయంలో ఒక యువకుడు మీ రాజభవన తూర్పుద్వార సమీపంలో కనిపిస్తాడు. వాడు కొద్దిగా పొట్టివాడే గాని, పెద్దపెద్ద మీసాలుంటాయి. ఆ యువకుణ్ణి రాజభవనంలోకి ఆహ్వానించి, యువరాణికి చికిత్స చేయించు. ఆమె వ్యాధిని అతడు సులభంగా నయం చేస్తాడు. అయితే ఆమెకు సంపూర్ణ ఆరోగ్యం సమకూరాలంటే యోగ్యుడయిన ఆ యువకుడికే నీ కుమార్తె నిచ్చివివాహం చేయాలి!"

"నా కుమార్తె ప్రాణాలు రక్షించుకోవడానికి నేనేమైనా చేస్తాను. ధన్యవాదాలు!" అన్నాడు రాజు మళ్ళీ నమస్కరిస్తూ.

"రాజా, ఆగండి. ఆ మాటలు నమ్మి మోసపోకండి!" అని హెచ్చరిస్తూ అపూ





ర్వుడు చెట్టుపై నుంచి కిందికి దూకాడు. రాజు దిగ్భ్రాంతితో చూస్తుండగానే, అపూర్వుడు రెండు చిన్న రాళ్ళు తీసుకుని రాపిడి కలిగించి, నిప్పురవ్వలు పుట్టించి, చితుకులు ఏరి మంటచేసి, దానిని చెట్టు తొర్రలోకి వేశాడు.

వెంటనే, "రక్షించండి, రక్షించండి!" అని కేకలు వేస్తూ, కుంభాండుడు తొర్రలో నుంచి కిందికి దూకాడు.

"పట్టుకోండి, పెద్ద మీసాలు గల యోగ్యుడయిన ఆ యువకుణ్ణి!" అని ఆజ్ఞాపించాడు అపూర్వుడు.

కుంభాండుడు రాజు పాదాలపైబడ్డాడు.

అంతలో అలికిడి విని అక్కడికి వచ్చిన రాజుగారి అంగరక్షకులు కుంభాండుడి పెడరెక్కలు విరిచికట్టారు.

"శిథిలాలయంలో వున్న ఆ దొంగ సాధువును కూడా బంధించండి. వాడి నోరు మూయవలసిన అవసరం లేదు. గురుశిష్యులు కలిసి చేసిన నేరాలను ఒప్పుకోనివ్వండి!" అన్నాడు అపూర్వుడు.

"అంతా బాగున్నది. అయినా, నా కుమార్తె వ్యాధి నయమయ్యే మార్గం ఏమిటి మహాత్మా?" అని అడిగాడు రాజు.

"ఉదయం తులసీదళాలరసం, సాయంకాలం బిల్వదళాలరసం ఇవ్వండి. కొన్నాళ్ళలో ఆమె వ్యాధిపూర్తిగా నయమవుతుంది. ఇక వస్తాను!" అని చెప్పి అపూర్వుడు ఎటో వెళ్ళి పోయాడు.

రాజు, భటులతోపాటు శిథిలాలయం సమీపించాడు. అక్కడ సర్పకేతుడు ధ్యాననిష్ఠలో ఉన్నవాడిలా కళ్ళు మూసుకుని కూర్చుని ఉన్నాడు. భటులు వాణ్ణి పట్టి బంధించబోయారు.

"ఏమిటది? ఎవరు మీరు?" అని అరిచిన సర్పకేతుడు, ఎదుట చేతులు బంధించబడి వున్న కుంభాండుణ్ణి చూడగానే, తన పథకం ఎదురు తిరిగినట్టు గ్రహించి మౌనంగా తల దించుకున్నాడు. రాజభటులు వాణ్ణి బంధించి, శిథిలాలయం నుంచి బయటకు లాక్కువచ్చారు.

—(ఇంకావుంది)








## 6

[సదానందముని యజ్ఞం నుంచి సృష్టించిన అద్భుతశక్తులు గల విచిత్రవ్యక్తి అపూర్వుడు, ముని ఆదేశానుసారం, పేదలనూ, సాధువులనూ, అమాయకులనూ దుర్మార్గుల నుంచి రక్షించడానికి పూనుకున్నాడు. దీర్ఘవ్యాధిని పోగొట్టే సాకుతో, రాకుమారిని పెళ్ళాడడానికి ఎత్తుగడ వేసిన దుష్ట మాంత్రికుణ్ణీ, నీచుడైన వాడి శిష్యుణ్ణీ రాజుకు పట్టిచ్చాడు.—తరవాత]

"సమీరా," అన్న పిలుపు విని, మంచం మీద పడుకున్న సమీరుడు, ఉలిక్కిపడి లేచాడు. అపరాత్రి వేళ అపూర్వుణ్ణి చూడగానే, ఆయనకు భక్తితో నమస్కరించాడు.

"నువ్వొక చిన్న సాయం చేయాలి," అన్నాడు అపూర్వుడు.

"మీకోసం ప్రాణాలివ్వమన్నా సంతోషంగా ఇస్తాను," అన్నాడు సమీరుడు.

"నా కోసం కాదు. నలుగురు కుర్రాళ్లు ఆపదలో చిక్కుబడిపోయారు. వాళ్ళను రక్షించాలి!" అన్నాడు అపూర్వుడు.

"మీ ఆజ్ఞను పాటించడానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు సమీరుడు.

"మాటలకిది సమయం కాదు. నా వెంటరా," అంటూ అపూర్వుడు చేయి పట్టుకుని వెలుపలికి నడిచాడు. సమీరుడు ఆయన్ను ఉత్సాహంగా అనుసరించాడు.







నడకవేగం హెచ్చుతూన్నకొద్దీ, సమీరుడికి గాలిలో తేలిపోతున్నంత తేలికగా అనిపించింది. కొంతసేపటికల్లా ఇరువురూ సముద్రతీరం చేరుకున్నారు. సముద్రంలో నది సంగమిస్తూన్న స్థలానికి కొద్ది దూరంలో ఒక ఓడ లంగరు దించబడి నిలబడి ఉన్నది.

''అయిదుగురు కుర్రాళ్ళు విహార యాత్రకని ఇటుకేసి వచ్చారు. దూరంలో ఓడ కనిపించగానే వాళ్ళకు దానిని సమీపించి చూడాలన్న ఉత్సాహం కలిగింది. దానిని ఆసరాగా తీసుకుని ఓడ యజమాని, వాళ్ళను మంచి మాటలతో ఓడ లోపలికి తీసుకు వెళ్ళాడు. ఓడలోని గదులనూ, వాటిలోని వింత వస్తువులనూ చూపాడు. ఓడ నడిచేవిధానాన్నీ, లంగరు దించే పద్ధతినీ విడమరిచి చెప్పాడు. తీరా, కుర్రాళ్ళు ఇంటికి తిరిగి వెళ్ళాలనుకున్నప్పుడు, ఓడ యజమాని వాళ్ళకు తియ్యటి పానీయం ఇచ్చాడు. దానిని తాగగానే వాళ్ళు స్పృహకోల్పోయి నిద్రమత్తులో పడిపోయారు. ఇక కొంతసేపట్లో ఓడ బయలుదేరుతుంది. ఆ కుర్రాళ్ళను దూర ద్వీపాలకు తీసుకుపోయి, బానిసలుగా విక్రయించాలని ఓడ యజమాని పథకం వేశాడు,'' అని వివరించాడు అపూర్వుడు.

''ఇవన్నీ మీకెలా తెలిశాయి?'' అని అడిగాడు సమీరుడు.

''ఆ కుర్రాళ్ళు చిన్న పడవలో ఓడను సమీపించడం చూశాను. ఓడ యజమాని ఉద్దేశాన్ని శంకించి, రహస్యంగా వాళ్ళను వెంబడించి వెళ్ళాను. చాటు నుంచి వాళ్ళ మాటలను విన్నాను,'' అన్నాడు అపూర్వుడు.

''మీరా ఓడలోకి ఎలా వెళ్ళారు?'' అని అడిగాడు సమీరుడు.

''ఇప్పుడు మనం ఎలా వెళ్ళనున్నామో, అలాగే వెళ్ళాను. అక్కడ నేను చాటు నుంచి ఏం చేయాలో నీకు సూచిస్తాను. నువ్వా కుర్రాళ్లకు బయటపడే మార్గం చూపాలి!'' అన్నాడు అపూర్వుడు.





"మీరేమో చాటుగా వుంటారు. మరి నేను నావికుల కంటబడకుండా కుర్రాళ్ళ కెలా దారి చూపగలను? వాళ్ళకు పట్టుబడి పోగలను కదా?" అన్నాడు సమీరుడు అనుమానంగా.

"నీకా అనుమానం వద్దు. నువ్వా పట్టుబడిన కుర్రాళ్ళలో ఒకడుగా కలిసిపో. కుర్రాళ్ళ సంఖ్య విషయంలో నావికులకు అనుమానం కలగవచ్చు. అయినా, అదీ ఒక తమాషాగానే వుంటుంది. సరే, నువ్విప్పుడు సముద్రయానానికి సిద్ధమే కదా?" అని అడిగాడు అపూర్వుడు.

"సిద్ధమే!" అన్నాడు సమీరుడు.

అపూర్వుడు సముద్రం కేసి చూస్తూ ఈలవేశాడు. మరుక్షణమే ఉవ్వెత్తున లేస్తున్న అలలపై, నీళ్ళను పైకి చిమ్ముతూ నాలుగు గండుమీనులు లేచిపడి ఒడ్డుకు ఉరుకుతూ వచ్చాయి. అపూర్వుడు సమీరుడికి చేయి అందించాడు. ఇరువురూ చెరొక గండుమీనం మీదికి ఎక్కారు. ఆ రెండు గండుమీనులూ శరవేగంతో ఓడకేసి బయలుదేరాయి. వాటికి రక్షణగా రెండు వైపులా మరి రెండుగండుమీనులు ఈదుతూ వెళ్ళాయి.

"ఈ గండుమీనుల్ని ఎలా మచ్చిక చేసుకోగలిగారు?" అని అడిగాడు సమీరుడు.



"నేను వీటిని మచ్చిక చేసుకోలేదు. విశ్వమంతటా దివ్యాత్మ వ్యాపించి ఉన్నది. మానవులలో, జంతువులలో, పక్షులలో, సర్వప్రాణికోటిలోనూ ఈ దివ్య అంశ ఆధారభూతంగా, అతిసూక్ష్మంగా వ్యాపించి ఉన్నది. ఆ అంశను స్పృశించి, సందేశాన్ని పంపామంటే, మన ఉద్దేశం మంచిదయినప్పుడు, ఆ ప్రాణి మన సందేశానుసారం నడుచుకుంటుంది. నేనా సూక్ష్మ అంశం ద్వారానే, ఈ గండుమీనులను ఆదేశించాను," అని వివరించాడు అపూర్వుడు.

"అలాగా! మరయితే, మానవహృదయాలలోనూ మీరా సహకారభావాన్ని





కలిగించగలరన్నమాట!'' అన్నాడు సమీరుడు.

''మనుషులందరిలోనూ అలాంటి సహకార భావాన్ని కలిగించలేము. ఎందుకంటే మనిషి మిగతా జంతుజాలం లాగా కేవలం ప్రకృతికి అధీనమైనవాడు కాడు. మానవజీవితంలో మనసు ప్రధానమైన పాత్ర వహిస్తున్నది. మనసులో అనుక్షణం ఎన్నో అనుమానాలూ, ఆలోచనలూ, ప్రశ్నలూ సముద్ర తరంగాల్లాగా వస్తూ వుంటాయి. అయినప్పటికీ, సత్యసంధులూ, మాయమర్మాలెరుగని స్వచ్ఛమైన మనసు కలిగినవారూ నా పిలుపును వినగలరు!'' అన్నాడు అపూర్వుడు.

ఇంతలో వాళ్ళు ఓడను సమీపించారు. చుట్టూ చీకటి. గండుమీనులకు కృతజ్ఞతలు చెప్పి, ఇద్దరూ ఓడలోకి ఎక్కారు. కిటికీ నుంచి లోపలికి తొంగిచూశారు. ఆ గదిలో కుర్రాళ్ళు హాయిగా నిద్రపోతున్నారు. ఇంకా వాళ్ళకు పానీయం మత్తు వదలలేదు. ఆ గది తలుపులు మూసి, తాళం వేసి ఉన్నది.

నిశ్శబ్దంగా, ఇద్దరూ పక్క గదిలోకి తొంగి చూశారు. అక్కడ ఓడ యజమాని, కూర్చుని తన సహచరులతో చర్చలు జరుపుతున్నాడు. ఆ గది నిండా, కత్తులూ, ఈటెలూ, కర్రలూ మరికొన్ని వింత ఆయుధాలూ ఉన్నాయి. వాళ్ళ మాటలను బట్టి, ఆ ఓడ సముద్రపు దొంగలముఠాకు చెందినదనీ, ఓడయజమాని దొంగలముఠా నాయకుడనీ, అపూర్వుడు గ్రహించాడు.

''ఆ పిల్లల తల్లిదండ్రులు వాళ్ళను వెతుక్కుంటూ వచ్చేలోగా, మనంఇక్కడి నుంచి వెళ్ళిపోవాలి,'' అన్నాడు ముఠా నాయకుడు.

''వాళ్ళు వస్తే మాత్రం ఏం చేయగలరు ? మన అనుమతి లేకుండా ఓడను సమీపించ లేరు గదా ?'' అన్నాడు ఉపనాయకుడు.

''మనల్ని గురించి ఎవరికీ అనుమానం రాకూడదు. అందుకు మనం ఏమాత్రం



అవకాశం ఇవ్వకూడదు.'' అన్నాడు నాయకుడు కోపంగా.

వాళ్ళిద్దరూ ఆ గది నుంచి బయటకు వచ్చారు. అపూర్వుడూ, సమీరుడూ వాళ్ళ కంట బడకుండా చీకటిలో దాక్కున్నారు. నాయకుడు ఆజ్ఞాపించగానే అనుచరులు లంగరెత్తారు. ఓడ కదిలింది. నాయకుడు వెళ్ళి, పిల్లలున్న గది తలుపులు తెరిచాడు.

''సముద్రంలో దూకి తిమింగిలాలకు ఆహారమై పోవాలనుకుంటే తప్ప, ఈ కుర్రాళ్ళు మన నుంచి తప్పించుకోలేరు!'' అన్నాడు ఉపనాయకుడు ఉత్సాహంగా.

ఇద్దరూ తలుపు దగ్గరి నుంచి, మరొక వైపుకు కదిలారు.

''ఆc, ఇదే మంచి సమయం. నువ్వు వెళ్ళి, కుర్రవాళ్ళ మధ్య పడుకో,'' అన్నాడు అపూర్వుడు సమీరుడి చెవిలో.

సమీరుడు మెల్లగా వెళ్ళి కుర్రవాళ్ళ మధ్య పడుకున్నాడు.

''వీళ్ళను రత్నద్వీపానికే కదా తీసుకు వెళుతున్నాము?'' అని అడిగాడు ఉపనాయకుడు.

''కాదు. మరొక చిన్న ద్వీపానికి చేర్చాలి. అక్కడికి నాలుగయిదు ప్రాంతాల నుంచి బానిస వ్యాపారులు వస్తారు. ఆ ద్వీపంలో మనం అడిగిన ధర పలుకుతుంది!'' అన్నాడు నాయకుడు.



గది నుంచి ఏదో శబ్దం వినిపించింది. ఉపనాయకుడు తొంగి చూశాడు. దీపం మరీ గుడ్డిగా వెలుగుతున్నది. వాడు లోపలికి వెళ్ళి వత్తిని ఎగదోశాడు.

''ఒక్క కుర్రవాడు వంద దీనారాలు పలుకుతాడు. ఐదుగురు, ఐదువందల దీనారాలు!'' అన్నాడు నాయకుడు ఉత్సాహంగా మీసాలు దువ్వుతూ.

''లెక్కలు వేయడంలో నువ్వు మరీ అంత అధ్వాన్నమని నాకు తెలియదు. వందను ఆరుతో పెంచితే ఐదువందలెలా వస్తాయి?'' అన్నాడు ఉపనాయకుడు.

''మూర్ఖుడా, కుర్రాళ్ళు అయిదుగురే; ఆరుగురు కాదు,'' అన్నాడు నాయకుడు.





"కాదు, ఆరుగురు!" అన్నాడు ఉప నాయకుడు.

"నువ్వు గాలిలోంచి ఒకణ్ణి కొత్తగా సృష్టించావా ఏమిటి?" అని కోపంగా అడిగాడు నాయకుడు.

"వచ్చి నువ్వే లెక్కించి, చూడు!" అని రెట్టించాడు ఉపనాయకుడు.

నాయకుడు లోపలికి వెళ్ళి, పిల్లలను లెక్కించాడు. నిజంగానే ఆరుగురున్నారు. నమ్మలేక దీపాన్ని చేతిలోకి తీసుకుని వెళ్ళి, పిల్లల ముఖాలను పరిశీలించి చూశాడు. మరొకసారి లెక్కించాడు.

"మరీ విచారించకు. ఎక్కువమంది వుంటే మనకే లాభం. ఐదువందల దీనారాలకన్నా, ఆరువందల దీనారాలు లాభసాటి కదా! ఇప్పుడు తెలిసింది కదా ఎవడు మూర్ఖుడో? నన్ను మూర్ఖుడివి అన్నందుకు క్షమాపణ చెప్పాలి!" అన్నాడు ఉపనాయకుడు గట్టిగా నవ్వుతూ.

"నన్ను మూర్ఖుడనడానికి నీ కెన్ని గుండెలు?" అంటూ నాయకుడు నడుముకు వేలాడుతూన్న కత్తి దూశాడు.

"నేను అనలేదు. నువ్వన్నమాటను నీకే అప్పగిస్తున్నాను!" అన్నాడు ఉపనాయకుడు.

"ఒక్కసారి కాదు. వందసార్లంటాను! నువ్వు మూర్ఖుడివి! మూర్ఖుడివి!" అని అరిచాడు నాయకుడు.

వాళ్ళ అరుపులు విని, ఓడలోని అనుచరులందరూ బిలబిలమంటూ అక్కడికి చేరారు. నాయకుడికీ, ఉపనాయకుడికీ మధ్య ద్వేషం, పగ ఉన్నాయని తెలుసు గాని, ఇంత దారుణంగా బయటపడగలరని ఎవరూ ఊహించలేదు.

"నీ మొండి కత్తిని చూసి హడలిపోవడానికి నేనేం అమాయకుణ్ణి కాను! నీ బెదిరింపులు నా దగ్గర సాగవు. జాగ్రత్త!" అని హెచ్చరించాడు ఉపనాయకుడు.

"ఏమిటీ! ఇది మొండికత్తా? దాని పదును చవిచూపిస్తాను, చూడు!" అని అరుస్తూ నాయకుడు ముందుకు ఉరికాడు.



ఉపనాయకుడు ఒక్క అడుగు వెనక్కు వేసి, మెరుపువేగంతో పక్కనున్న కత్తిని అందుకుని, నాయకుడి రొమ్ములోకి దించాడు. నాయకుడు కీచుమని అరుస్తూ కిందికి ఒరిగిపోయాడు.

అనుచరులందరూ, భయంతో, మౌనంగా శిలల్లా నిలబడిపోయారు!

ఉపనాయకుడు బిగ్గరగా నవ్వుతూ, "ఈ దుర్మార్గుడికి తగిన శిక్షే పడింది. ఈ నీచుడు, మన పాతనాయకుణ్ణి ఎలా వంచనతో చంపాడో మీరు మరిచిపోలేదు కదా? నేను వీణ్ణి మోసంతో చంపలేదు. ప్రాణరక్షణకే కత్తిని ఉపయోగించాను. పైగా, ఐదుకూ, ఆరుకూ తేడా తెలియని మూర్ఖుడు మనకు నాయకుడుగా ఉండడానికి తగడు. ఆ దుర్మార్గుడి శవాన్ని సముద్రంలోకి విసిరి మీమీ పనులకు వెళ్ళండి!" అని ఆజ్ఞాపించాడు.

వాడి ఆజ్ఞానుసారం కొందరు అనుచరులు నాయకుడి మృతదేహాన్ని, సముద్రంలోకి నెట్టారు.

ఓడలోని కేకలు విని, గదిలోని కుర్రవాళ్ళు మేలుకొని లేచి కిటికీగుండా వెలుపలికి చూడబోయారు. వెంటనే సమీరుడు దీపం ఆర్పి, వాళ్ళతో మెల్లగా ఇలా అన్నాడు: "సముద్రపు దొంగలు మిమ్మల్ని తరలించుకుని వెళ్ళి, దూరద్వీపంలో బానిసలుగా అమ్మడానికి పథకం వేశారు. నా మాట విన్నారంటే ఈ గండం నుంచి బయటపడే ఉపాయం చెబుతాను. ఇప్పుడు నిద్రపోతూన్నట్టు అలాగే పడుకుని కళ్ళు మూసుకోండి. దొంగల పథకంగాని, ఇంతవరకు జరిగిన గొడవలో దొంగల నాయకుడు చచ్చిన విషయంగాని మనకు ఏమాత్రం తెలియనట్టుగా నే నడుచుకోవాలి. దొంగల ఉద్దేశాన్ని మనం పసిగట్టినట్టు వాళ్ళు గ్రహిస్తే మనల్ని బంధించవచ్చు. అది మరీ అపాయం!"

ఆ మాటలు విని కుర్రాళ్ళు భయాశ్చర్యాలతో, ఏమీ మాట్లాడలేకపోయారు. సమీరుడు చెప్పినట్టు అలాగే పడుకుని కళ్ళుమూసుకున్నారు. —(ఇంకా వుంది)








## 7

[సదానందముని సృష్టించిన అపూర్వుడనే విచిత్రవ్యక్తి, సముద్రపు దొంగలు అపహరించుకుపోతూన్న ఐదుగురు కుర్రవాళ్లను కాపాడడానికి, సమీరుణ్ణి వెంటబెట్టుకుని ఓడలోకి చేరాడు. ఓడ బయలుదేరింది. ఓడలో దొంగలనాయకుడికీ, ఉపనాయకుడికీ మధ్య గొడవ ప్రారంభమయింది. ఉపనాయకుడు, నాయకుణ్ణి కత్తితో పొడిచి చంపాడు. —తరవాత]

తెల్లవారుతూండగా, ఓడలోని దొంగల ఉపనాయకుడు, కుర్రవాళ్ళు పడుకున్న గదిలోకి వచ్చి, ''లేవండి, లేవండి. ఈ సముద్రమధ్యంలో సూర్యోదయం ఎంత అందంగా వుందో చూడండి,'' అని వాళ్ళను నవ్వుతూ తట్టి లేపాడు.

సమీరుడి ద్వారా అపూర్వుడు చెప్పి పంపిన ప్రకారం, ధైర్యంగా కళ్ళు మూసుకుని పడుకుని వున్న కుర్రవాళ్ళు లేచి, చుట్టుపక్కల ఒక్కసారి కలయచూసి, ''ఏమిటి! మేం ఎక్కడ ఉన్నాం? నువ్వెవరు, బాబూ?'' అని అడిగారు.

''నేను ఈ ఓడ యజమాని, గరళనాభుణ్ణి!'' అన్నాడు ఉపనాయకుడు.

''ఏమిటీ! ఓడ యజమానివా?'' అని ప్రశ్నించాడు సమీరుడు ఆశ్చర్యంగా.

''నన్ను చూస్తూంటే మీకు ఆశ్చర్యం కలగవచ్చు. మిమ్మల్ని ఈ ఓడలోకి







తీసుకువచ్చిన పెద్దమనిషి, ఒక ముఖ్యమైన పనిమీద మరొక చోటికి వెళ్ళవలసి వచ్చింది. మిమ్మల్ని జాగ్రత్తగా చూసుకునే బాధ్యత ఆయన నాకు అప్పగించి వెళ్ళాడు. ఇప్పుడు మీరు ఓడలో ఉన్నారన్న సంగతి మరచిపోలేదు కదా!'' అన్నాడు గరళనాభుడు.

సమీరుడు ఒళ్ళు విరుచుకుని లేచి నిలబడి చేతులు పైకెత్తి, ''ఆలస్యమయింది. మేము వెంటనే మా ఇళ్ళకు తిరిగి వెళ్ళాలి!'' అన్నాడు.

''ఆహా....హాఁ,'' అని రాక్షసుడిలా నవ్వబోయిన గరళనాభుడు, క్షణంలో తమాయించుకుని, ''అసలు ఏం జరిగిందో నాకు తెలియదుగాని, మీరు ఆరుగురూ రాత్రి, ఒళ్ళు మరచి నిద్రపోయారు. మీకు నిద్రాభంగం కలిగించడం ఇష్టం లేక ఊరుకుండిపోయాను. రాత్రే ఓడ బయలుదేరింది. రాత్రి తెల్లవార్లూ ప్రయాణం చేసి, చాలాదూరం వచ్చేశాము. ఇక్కడి నుంచి మీరు ఈదుకుంటూ వెళ్ళి, తీరం చేరలేరు గనక, హాయిగా సముద్ర విహారం చేయండి!'' అన్నాడు గరళనాభుడు పరిహాసంగా.

కుర్రవాళ్ళు ఏమీ ఎరగనట్టు, అమాయకంగా ఒకరి ముఖాలొకరు చూసుకోసాగారు.

''అయితే, ఇప్పుడు మా గతేమిటి?'' అని అడిగాడు సమీరుడు మళ్ళీ.

''కొన్ని రోజుల తరవాత, చాలా అనుభవం గడించి, మనం మళ్ళీ తీరాన్ని చేరుకుంటాం. అంతవరకు ప్రకృతి సౌందర్యాన్ని చూసి ఆనందించండి!'' అన్నాడు గరళనాభుడు.

''మీ సలహా బాగానే ఉన్నది. కాని, మేము కనిపించకపోతే, మా తల్లి తండ్రులూ, బంధుమిత్రులూ బాధపడిపోగలరు కదా?'' అని అడిగాడు ఒక కుర్రవాడు బాధగా.

''కొన్నాళ్ళ తరవాత మిమ్మల్ని చూసి, వాళ్ళే రెండింతల ఆనందం పొందగలరు

కదా!'' అన్నాడు గరళనాభుడు బిగ్గరగా నవ్వుతూ.

''మీరు చాలా మేధావంతులు!'' అన్నాడు సమీరుడు.

ఆ మాటలకు గరళనాభుడు పొంగిపోయాడు. గర్వంగా దూరంగా వున్న తన అనుచరులకేసి ఒకసారి చూశాడు. ఆ తరవాత కుర్రవాళ్ళను గది నుంచి వెలుపలికి తీసుకువచ్చాడు. మిగతా అయిదుగురు కుర్రవాళ్ళూ, సముద్రంలో సూర్యోదయ దృశ్యాన్ని చూసి ఆనందిస్తూండగా, సమీరుడు, అపూర్వుడి పిలుపు విని అటుకేసి తిరిగి చూశాడు. అక్కడ ఎవరూ కనిపించలేదు. ఎడమ వైపుకు వంగి చూశాడు. అపూర్వుడు ఒక గండు మీనం మీద నిలబడి ఉన్నాడు. ఆ గండుమీనం ఓడను అనుసరించి, ఈదుకుంటూ వస్తున్నది!

''దొంగల గుప్పిటనుంచి బయట పడాలని ప్రయత్నిస్తున్నట్టు పసిగట్టారంటే, వాళ్ళు మిమ్మల్ని హింసించగలరు. ఇప్పుడు దొంగలు మీతో మంచిగా వున్నారంటే దానికి కారణం మీ ద్వారా వాళ్ళేదో సాధించాలని ఆలోచిస్తున్నారనే భావించాలి. వర్తకుల ఓడ ఒకటి ఇటుకేసి వస్తుందనీ, దానిని దోచుకోవాలనీ గరళనాభుడు రాత్రి అనుచరులతో చెప్పడం విన్నాను. వాళ్ళ పథకం విజయం కావడానికి మిమ్మల్ని ఉపయోగించుకోవచ్చు. వాళ్ళ పథకం మనకు స్పష్టంగా తెలిసిం







దంటే మనం ఏదైనా చేయవచ్చు. అంత వరకూ వాళ్ళతో అతి జాగ్రత్తగా వ్యవహరించాలి!'' అని హెచ్చరించాడు అపూర్వుడు.

''బాబూ, అలా ఇంకా కొంచెం కిందికి వంగిచూశావంటే, అమాంతం సముద్రంలో పడి, తిమింగిలాలకు ఆహారం అయిపో గలవు. ఇక్కడ మేము నీ కోసం కాచుకుని వున్నాం, రా,'' అని కేక వేశాడు గరళనాభుడు నవ్వుతూ.

వెంటనే సమీరుడు గరళనాభుడి కేసి తిరిగి నవ్వుతూ, వాణ్ణి సమీపించాడు. అందరూ భోజనం చేయడానికి కూర్చున్నారు. అప్పుడు సమీరుడు, ''అవును, మీరీ ఓడలో ఏం చేస్తారు?'' అని అడిగాడు చాలా అమాయకంగా ముఖం పెట్టి.

''మేము సముద్ర వర్తకులం నాయనా, మా రోజులు బాగులేక ఇటీవల మా ఓడను సముద్రపు దొంగలు దోచుకున్నారు!'' అన్నాడు గరళనాభుడు.

''దుర్మార్గులు!'' అన్నాడు సమీరుడు.

''పరమ దుర్మార్గులు, నాయనా! నిరాయుధులుగా వున్న సమయం చూసి ఆ దుర్మార్గులు హఠాత్తుగా మామీదికి దాడి జరిపారు. చీమలకైనా హాని తలపెట్టని మాలో పలువురి ప్రాణాలు కూడా తీశారా కర్కోటకులు!'' అన్నాడు గరళనాభుడు ఎంతో విచారంగా.

''అయ్యోపాపం! మీ మంచితనంమాకు తెలుస్తూనే ఉన్నది. లేకుంటే ముక్కూ మొహం తెలియని మా అరుగురిని ఈ ఓడలోకి అనుమతించి, ఉచితంగానే భోజన సదుపాయాలు కల్పించి, ఇలా సముద్రయానానికి తీసుకువెళుతున్నారంటే, మీరు నిజంగానే పరమ దయామయులు! అదిసరే, మరి మీరిప్పుడు ఏం చేయాలనుకుంటున్నారు?'' అని అడిగాడు సమీరుడు.

''మొదట ఒక ద్వీపాన్ని చేరుకుంటాం. అక్కడ కొంత ధనసంపాదనకు మార్గం కనిపిస్తున్నది....'' అని గరళనాభుడు





ఇంకేదో అనబోయేంతలో, సమీరుడు అడ్డుపడి, "అదెలా సాధ్యం? ఈ ఓడలో మేము ఆరుగురం తప్ప సరుకులేవీ కనిపించడం లేదే!" అని అడిగాడు చిన్నగా నవ్వుతూ.

"అహా....హా....కుర్రాడివైనా తమాషాగా మాట్లాడుతున్నావే! ఇప్పుడు మన ఓడలో సరుకులు లేవుగాని, మీరు కాస్త సాయం చేశారంటే మనం ఆ ద్వీపం చేరేలోగా కావలసినన్ని సరుకులు సంపాయించగలం!" అన్నాడు గరళనాభుడు.

"ఏమిటి! ఈ నడిసముద్రంలోనా! అదెలా సాధ్యం? అయినా, కుర్రవాళ్ళమయిన మేం చేయగల సహాయం ఏమిటి?" అని అడిగాడు సమీరుడు.

"మా ఓడను దోచుకున్న దొంగల ఓడ త్వరలో ఇటు కేసి వస్తుంది. మనం ఆ ఓడను సమీపించగానే, ఆపదలో వున్న సూచనగా నల్లజెండాను ఎగురవేస్తాను. మీరు ఓడలోని గదుల బయట నిలబడి, ఆ ఓడలోని వాళ్ళకు వినిపించే విధంగా గొంతెత్తి రక్షించమని ఆర్తనాదం చేయాలి," అన్నాడు గరళనాభుడు.

"ఆ తరవాత?" అని అడిగాడు సమీరుడు.

"మీ ఆర్తనాదాలు విని వర్తకుల వేషాలలో వున్న దొంగల ఓడ మన ఓడను



సమీపిస్తుంది. అప్పుడు మీరు వాళ్ళతో, 'మా ఓడ మీద సముద్రపు దొంగలు పడి దోచుకున్నారు. ఆ దొంగలు మా పెద్దలతో సహా నావికులందరినీ చంపి వెళ్ళారు.' అని చెప్పి దీనంగా విలపించాలి. మీ మాటలు నమ్మి ఆ ఓడలో నుంచి కొందరు మన ఓడలోకి వస్తారు. వాళ్ళను మీరు తిన్నగా మేము కూర్చున్న గదిలోకి తీసుకురావాలి. ఆపైన జరగవలసింది మేము చూసుకుంటాం!" అన్నాడు గరళనాభుడు.

"అద్భుతమైన ఆలోచన!" అన్నాడు ఒక కుర్రవాడు.

"పథకం బాగున్నది కదా! మాతో సహకరించారంటే మిమ్మల్ని తగిన



విధంగా సత్కరించగలం!'' అన్నాడు గరళనాభుడు.

''చాలా సంతోషం. ఆపైన, మీరు ఆ వర్తకుల్ని ఏం చేస్తారు?'' అని అడిగాడు సమీరుడు.

గరళనాభుడు పెదవులు బిగబట్టి, కొంతసేపు మౌనంగా ఆలోచించి, గట్టిగా నిట్టూరుస్తూ, ''ఆ దుర్మార్గులు చేసిన ఘోరమైన అపకారానికి వాళ్ళను హతమార్చినా పాపంలేదు. కాని, వాళ్ళను చంపడానికి నా మనసు అంగీకరించడంలేదు. అందుకే, వాళ్ళ ఓడను దోచుకుని దానిని సముద్రంలో ముంచి, వాళ్ళను బందీలుగా పట్టుకుని వెళ్ళి బానిసల సంతలో అమ్మేస్తాం. చంపడం కన్నా వాళ్ళను బానిసలుగా విక్రయించడం వాళ్ళపై దయచూపినట్టే కదా!'' అన్నాడు గరళనాభుడు.

బానిసలసంత అన్న మాట వినగానే కుర్రవాళ్ళు భయకంపితులయ్యారు.

అంతలో గరళనాభుడి ముఖ్యానుచరుడు లోపలికి వచ్చి, ''ఓడ కనిపించింది!'' అన్నాడు అమితోత్సాహంగా.

''శభాష్! మన ఓడను త్వరగా దానికేసి నడిపించండి. ఆ ఓడలోని మనుషులు కనిపించగానే, మనవాళ్ళు తెడ్లను కుర్రవాళ్లకు అప్పగించి, ఎదుటివాళ్ల కంటబడకుండా ఒక గదిలో దాక్కోవాలి, వెళ్ళు!'' అని అజ్ఞాపించాడు గరళనాభుడు.

గరళనాభుడూ, కుర్రవాళ్ళూ భోజనం ముగించి, గదినుంచి బయటకు వచ్చారు. దూరంలో వర్తకుల ఓడ కనిపించింది. కొంతసేపు వాయువేగంతో ప్రయాణం చేసి వర్తకుల ఓడను సమీపించగానే, నాయకుడి అజ్ఞానుసారం, దొంగలు తెడ్లను కుర్రవాళ్ళకు అప్పగించి, లోపలికి వెళ్ళారు.

సమీరుడు, ఓడ తెరచాప కొయ్యకు అనుకుని వున్న పలకమీదికి ఎక్కి, వర్తకపు ఓడలోని వాళ్ళకు కనిపించే విధంగా నిలబడ్డాడు. అప్పుడు తాను ఉన్న





దొంగల ఓడలో నుంచి ఒక సముద్రపు కాకి, ఎగిరివెళ్ళి వర్తకపు ఓడలో వాలడం సమీరుడు గమనించాడు. దాని ద్వారా వాళ్ళకు అపూర్వ్వడేదో సందేశం పంపి నట్టు సమీరుడు గ్రహించాడు.

అంతవరకూ అటూ ఇటూ తిరుగుతూన్న గరళనాభుడు తెరచాపకొయ్యకు నల్ల జెండాను కట్టి సమీరుడితో, "ఆ ఓడలోనుంచి వచ్చే వర్తకుణ్ణి, వాడి సహవర్తకుల్ని మేమున్న గదిలోకి తీసుకువచ్చే బాధ్యత నీది!" అని హెచ్చరించి, తన అనుచరులతో సహా లోపలి గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు.



సమీరుడు గొంతెత్తి, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టాడు.

ఆ కేకలు విని వర్తకపు ఓడలోని గదిలో నుంచి పెద్దమనిషిలాగా ఉన్న ఒక వర్తకుడు బయటికి వచ్చాడు. ఆయనకు ఇరువైపులా దృఢకాయులయిన అంగరక్షకులు కొందరున్నారు.

"ఈ ఓడలో మేము అరుగురు కుర్రవాళ్లమే ఉన్నాం. మావాళ్లనందరినీ, సముద్రపు దొంగలు హతమార్చి వెళ్ళారు. మమ్మల్ని రక్షించండి, రక్షించండి!" అని సమీరుడు అరిచాడు.

వర్తకుల ఓడ మరుక్షణమే దొంగల ఓడ దగ్గరికి వచ్చింది. ఇద్దరు దృఢకాయులు ఒక పొడవాటి పలకను తెచ్చి, రెండు ఓడలను కలుపుతూ వేశారు. వర్తకుడూ,మరినలుగురుదృఢకాయులూ ఆ పలకమీదుగా నడిచివచ్చి, దొంగల ఓడలోకి దిగారు. వర్తకుడు సమీరుణ్ణి మెల్లగా, "ఎక్కడా దుర్మార్గులు?" అని అడిగాడు.

సమీరుడు దొంగలు దాక్కున్న గదిని చూపుతూ, "రండి బాబూ, రండి. దొంగలు వదిలివెళ్ళిన విలువైన సరుకులు ఇంకా కొన్ని ఆ గదిలో మిగిలి ఉన్నాయి. వాటన్నిటినీ మీరు తీసుకుని, మమ్మల్ని మా ఇళ్ళకు చేర్చండి, అదేచాలు!" అన్నాడు బిగ్గరగా.

"భయపడకండి మిమ్మల్ని రక్షించడానికే మేము వచ్చాం!" అంటూవర్తకుడు దొంగలున్న గదినిసమీపించి,రెప్పపాటులో దాని తలుపులు మూసి తాళంవేశాడు. ఆ తరవాత ఆయన కిటికీగుండా లోపలికి తొంగి చూస్తూ, "దుర్మార్గులారా, మీపాపం పండింది. నాతోపాటు పాతికమంది దృఢకాయులు నాకు రక్షణగా ఉన్నారు. మీరెందరి ఓడల్లో దోచుకుని, అమాయకులను వేధించి క్రూరంగా సముద్రం పాలు చేశారు. ఆ పాపఫలితం ఇప్పుడు అనుభవించక తప్పదు. తప్పించుకోవాలని ప్రయత్నించారంటే ఆ క్షణమే మీ ఓడను భస్మంచేస్తాం. మావద్దపీపాలనిండాఓడను తగలబెట్టడానికి కావలసినంత నూనె ఉన్నది. కిక్కురుమనకుండా కూర్చోండి. రేపీపాటికి తీరం చేరుకోగలం, అంత వరకూ మీకు తిండిలేదు. తాగడానికి మంచినీళ్ళు మాత్రం ఇస్తాం. కూర్చున్న చోటునుంచి కదిలారో ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

దొంగలున్న గదిచుట్టూ పదిమంది దృఢకాయులు కాపలాగా నిలబడ్డారు. మరి కొందరు దొంగల ఓడను తాళ్ళతో తమ ఓడకు కట్టి బిగించారు. కుర్రవాళ్ళు పట్టరాని ఆనందంపొందారు. సమీరుడు అపూర్వుడికోసం చుట్టుపక్కలపరిశీలించి చూస్తూండగా, వర్తకుడు, "నాయనా, ఒక సముద్రపు కాకితో ఎలా సందేశాన్ని పంపగలిగావు?" అని అడిగాడు అతని వెన్ను చరుస్తూ.

"ఆ సందేశం నేను పంపలేదు. మమ్మల్ని రక్షించడానికి వచ్చిన ఒక దివ్య పురుషుడు పంపాడు!" అన్నాడు సమీరుడు.

"ఎక్కడా మహానుభావుడు?" అని అడిగాడు వర్తకుడు.

"నాకూ తెలియదు. కాని, ఆయన త్వరలోనే మీ దగ్గరికి రాగలడు," అన్నాడు సమీరుడు.

ఓడలు రెండూ వేగంగా తీరంకేసి బయలుదేరాయి. —(ఇంకావుంది)






## 8

[అపూర్వుడి ఆదేశానుసారం, సమీరుడు, సముద్రపు దొంగలపాలైన ఐదుగురు కుర్రవాళ్ళను కాపాడడానికి ఆయనతోపాటు గండుమీనం మీదెక్కి ఓడను చేరుకున్నాడు. వర్తకుల ఓడను దోచుకోవడానికి గరళనాభుడి నాయకత్వంలో సముద్రపు దొంగలు వేసిన పథకం బెడిసికొట్టింది. వర్తకుల సాయంతో సమీరుడూ, అయిదుగురు కుర్రవాళ్ళూ తీరం చేరారు. —తరవాత]

సురక్షితంగా తిరిగివచ్చిన పిల్లలను చూసి, వాళ్ళ తల్లిదండ్రులూ, బంధుమిత్రులూ అమితానందం చెందారు. దుర్మార్గులైన సముద్రపుదొంగలు పట్టుబడడంతో, ప్రజలందరూ పరమానందం చెందారు. రాజు దొంగలను కారాగారంలో బంధించి, ఐదుగురు కుర్రవాళ్ళ ధైర్యాన్ని ఎంతగానో మెచ్చుకున్నాడు. సమీరుణ్ణి ఘనంగా సత్కరించాడు. సమీరుడి తెలివితేటలనూ, ధైర్యసాహసాలనూ అందరూ వేనోళ్ళ పొగిడారు.

సమీరుడికి వారి పొగడ్తలు ఇబ్బంది కలిగించాయి. ఎందుకంటే, అపూర్వుడి కరుణవల్లే, కుర్రవాళ్ళను సముద్రపు దొంగల నుంచి సమీరుడు రక్షించగలిగాడు. తాను అపూర్వుడి చేతిలో కేవలం చిన్న ఆయుధం మాత్రమే అన్న విషయం అతడికి ఒక్కడికే తెలుసు.



సత్కారాల హడావుడి సద్దుమణిగిన తరవాత, సమీరుడు తమ ఇంటి సమీపంలో వున్న ప్రశాంత స్థలానికి ఒంటరిగా వెళ్ళాడు. ఏకాగ్రచిత్తంతో ఎప్పుడు పిలిచినా వస్తానని అపూర్వుడు మాట ఇచ్చాడు. ఇప్పుడు ఆయనను చూడాలనుకుని, సెలయేటిపక్కన వున్న బండ మీద కూర్చుని, అపూర్వుణ్ణి తలుచుకుని కళ్ళు మూసుకోబోయాడు. ఆ క్షణమే, "నేను ఇక్కడే ఉన్నాను, సమీరా!" అన్న మధురకంఠస్వరం వినిపించింది.

మందహాసంతో ఎదుట నిలబడిన అపూర్వుణ్ణి చూడగానే సమీరుడు చేతులు జోడించి నమస్కరించాడు.

"సమీరా, నువ్వు నన్ను చూడాలనుకున్నదానికి ముందే నేనూ, నిన్ను చూడాలనుకున్నాను. అందుకే ఇలా వచ్చాను," అన్నాడు అపూర్వుడు.

సమీరుడు చాలా సంతోషంగా, "అహా అహా....!" అన్నాడు తప్ప మరేమీ మాట్లాడలేకపోయాడు.

"మనం అనుభవిస్తూన్న ఈ ఆనందాన్ని ప్రజలందరికీ పంచాలి. ముఖ్యంగా మీ గ్రామంలోని పేద ప్రజల పరిస్థితి మరీ దీనంగా ఉన్నది. తినడానికి తిండిలేక, కట్టుకోవడానికి బట్టలేక, రోగాలకు వైద్యం చేయించుకోలేక కటికదరిద్రంతో వాళ్ళు అలవికాని బాధలు అనుభవిస్తున్నారు. నువ్వు వాళ్ళకేమైనా సాయం చేయలేవా?" అని అడిగాడు అపూర్వుడు.

"నేనేం సహాయంచేయగలను, స్వామీ! నాకూ వాళ్ల బాధలు పోగొట్టాలనే వున్నది. అయితే, వాళ్ళ బాధలన్నిటికీ మూలం దరిద్రం. ధనం వుంటే తప్ప, నేను వాళ్ళ దరిద్రాన్నీ, బాధలనూ పోగొట్టలేను. మరి నా దగ్గర ధనం లేదుకదా?" అన్నాడు సమీరుడు.

"నీకు కావలసిన ధనం నేను సమకూరుస్తాను. అదిసరే, నన్ను స్వామీ అని పిలువకూడదని ఎప్పుడో చెప్పాను. మరోసారి అలా పిలిచావో నేను నీతో

మాట్లాడను," అన్నాడు అపూర్వుడు మందలిస్తూన్నట్టు.

"మీ అజ్ఞను పాటిస్తాను, మిత్రమా! ఇంతకూ నాకు ధనం ఎలా సమకూరుస్తావు?" అని అడిగాడు సమీరుడు.

"నేను ఓడలో ఉన్నప్పుడు, సముద్రపు దొంగలు, శిలాద్వీపంలో దాచిన నిధిని గురించి మాట్లాడుకోవడం విన్నాను. దాదాపు పదేళ్ళక్రితం, ఒకానొక యువరాణి, పెళ్ళి చేసుకుని, అత్తవారింటికి వెళుతున్నప్పుడు పెద్ద దొంగల ముఠా వాళ్ళపైబడి ఆభరణాలను దోచుకున్నదట!" అని అపూర్వుడు ఇంకేదో చెప్పబోయేంతలో, సమీరుడు అడ్డుపడి, "అవునవును. ఆ దోపిడీని గురించి మా పెద్దలు కూడా తరచూ కథలు కథలుగా చెప్పుకునేవాళ్ళు!" అన్నాడు పట్టరాని ఉత్సాహంతో.



"నిజమే! మణులు మాణిక్యాలు పొదిగిన యువరాణి ఆభరణాలనూ, ఇతరుల నుంచి దోపిడీ చేసిన మరిన్ని అమూల్యమైన నగలనూ, బంగారాన్ని దొంగలు శిలాద్వీపంలోని గుహలో దాచారు. అంతలో హఠాత్తుగా వాళ్ళమధ్య తగాదా ఏర్పడి, దొంగలు రెండు ముఠాలుగా చీలిపోయి, ఒకరిపై ఒకరు కత్తులు దూశారు. నిధి తమకు చెందాలంటే తమకే చెందాలని ఇరు వర్గాల మధ్య ఘర్షణలు బయలుదేరడంతో, ఏ ముఠావాళ్ళుగాని నిధిని వశపరుచుకోలేకపోయారు. ఇటీవల జరిగిన ఒక ఘర్షణలో ఒక ముఠాదొంగలు, శత్రువర్గంలో చాలామందిని హతమార్చారు. ఏదో కొందరు మాత్రమే తప్పించుకుని పారిపోయారు. జయించిన ముఠాకు చెందిన దొంగలనే నువ్వు మొన్న రాజుగారికి అప్పగించావు. వాళ్ళు వర్తకుల ఓడను దోచుకున్న తరవాత ఆ నిధిని వశపరచుకోవాలని పథకం వేశారుగాని, ఆ దురాశాపరులందరూ ప్రస్తుతం జైళ్ళపాలయ్యారు!" అన్నాడు అపూర్వుడు చిన్నగా నవ్వుతూ.



ఎక్కడున్నదీ తెలుసనుకుంటాను. నా ఆలోచనలను పసిగట్టి, వాటికి అనుగుణంగా నడుచుకునే స్నేహితులు ఆ గండు మీనాలు. ఈ విషయంలోనూ అవి మనకు తప్పకుండా సాయపడగలవని భావిస్తున్నాను. రేపు నిండు పున్నమి. మనం శిలాద్వీపాన్వేషణకు బయలుదేరడానికి తగిన సమయం,'' అన్నాడు అపూర్వుడు.

ఆ మాటలు విని సమీరుడు అమితోత్సాహంతో, ''మనతోపాటు ఆ ఐదుగురు మిత్రులను కూడా తీసుకువెళదామా? మిమ్మల్ని చూడాలనీ, మీతో కలిసి సాహస యాత్ర చేయాలనీ వాళ్ళు కుతూహల పడుతున్నారు,'' అని అడిగాడు.

అపూర్వుడు కొంతసేపు ఆలోచించి, సరేనని చెప్పి వెళ్ళిపోయాడు.

సమీరుడు కుర్రవాళ్ళ తల్లిదండ్రుల అనుమతి తీసుకుని, వాళ్ళను వెంటబెట్టుకుని మరునాడు సాయంకాలం సముద్ర తీరానికి బయలుదేరాడు. ఐదుగురు మిత్రులూ అపూర్వుణ్ణి చూడడానికి ఉరకలు వేసే ఉత్సాహంతో వచ్చారు. వాళ్ళు సముద్రతీరం చేరేసరికి అపూర్వుడు అక్కడే ఉన్నాడు. కుర్రవాళ్ళు ఆయనకు నమస్కరించారు. అపూర్వుడు చిరునవ్వుతో పలకరించాడు.

''అంటే సురక్షితంగా వున్న ఆ నిధిని ఇప్పుడు మనం వశపరచుకోవచ్చన్న మాట!'' అన్నాడు సమీరుడు.

''అవును. అయినా, అది అక్కడ ఎంతోకాలం సురక్షితంగా వుండే అవకాశం లేదు. ఎందుకంటే ప్రాణాలతో తప్పించుకున్న దొంగలకు తమ శత్రువులు జైళ్ళ పాలయ్యారని తెలియగానే, వాళ్ళు ఆ నిధిని వశపరచుకోవడానికి త్వరపడ వచ్చు.'' అన్నాడు అపూర్వుడు.

''అది సరే, మనం ఆ శిలాద్వీపాన్నికనుగొనడం ఎలా ?'' అని అడిగాడు సమీరుడు.

''మొన్న మనల్ని ఓడదగ్గరికి తీసుకువెళ్ళిన గండుమీనాలకు ఆ శిలాద్వీపం

తూర్పు దిక్కున నిండు చంద్రుడు వెన్నెలలు వెదజల్లుతూండగా, అపూర్వుడు ఒక్కక్షణం కళ్ళుమూసుకుని గండు మీనాలను స్మరించాడు. మరుక్షణమే అలలకు ఆవల ప్రశాంతంగా ఉన్న సముద్ర జలాలను పైకి చిమ్ముతూ గండు మీనాలు ఎగిరి దూకడం కనిపించాయి. కొంతసేపటికల్లా అవి తీరాన్ని సమీపించి, ప్రయాణానికి సంసిద్ధతను తెలియజేసే విధంగా వింత ధ్వనులు చేశాయి. వాటిలో పెద్దదిగా ఉన్న గండుమీనం వీపు మీదికి అపూర్వుడు చేరాడు. ఆయన ఆజ్ఞ కాగానే, సమీరుడూ, ఐదుగురు మిత్రులూ వేర్వేరు గండుమీనాల మీదికి ఎక్కి కూర్చున్నారు. మరో పన్నెండు గండుమీనాలు వాళ్ళకు రక్షణగా వచ్చాయి. అన్నీ కలిసి కట్టుగా సముద్రం లోకి దూసుకుపోసాగాయి.

అపూర్వుడు ఎక్కిన గండుమీనం మిగతావాటికి దారి చూపుతూ ముందు ఈదసాగింది. ప్రశాంతంగా ఉన్న సముద్రం మీద గాలి మెల్లమెల్లగా వీచ సాగింది. అపూర్వుడి తలకు పైన కొన్ని సముద్రపుకాకులు గిరికీలు కొడుతూ ఎగర సాగాయి. అలాచాలా సేపు ప్రయాణంచేసి, చంద్రుడు నడినెత్తిమీదికి వచ్చిన సమ యానికి, వాళ్ళు సముద్రజలం మధ్య నిటా



రుగా నిలబడిన రాక్షసుల గుంపులాగా కని పించే శిలాద్వీపాన్ని సమీపించారు. గండు మీనాలు ఆ శిలలను అనుకుని ఆగాయి.

అపూర్వుడూ, ఆయన ఆరుగురు మిత్రులూ గండుమీనాలపై నుంచి దిగి శిలాద్వీపంలో అడుగు పెట్టారు. పెద్దపెద్ద బండల వంటి శిలల మధ్య అసంఖ్యాక మైన గుహలు కనిపించాయి. సముద్రపు దొంగలు దాచిన నిధి ఏ గుహలో ఉన్నదో తెలుసుకోవడం ఎలా? అది అంత సులభంగా కనిపించలేదు.

కుర్రవాళ్ళు ముందున్న గుహలోపలికి తొంగిచూశారు. అక్కడ ఏదో తళతళా మెరుస్తూ కనిపించడంతో, సమీరుడు వంగి,



మెల్లగా గుహలోపలికి జొరబడ్డాడు. చుట్టూ చీకటి, నేల చిత్తడిగా ఉన్నది. సమీరుడు మోకాళ్ళ మీదికి వంగి, ముందుకు పాకసాగాడు. కాని, గుహలోపలి బొరియలలోని పాములు బుస్సు మనడంతో వాడు భయపడి వెనక్కు వచ్చేశాడు!

''సరే, ఇప్పుడు ఎలాగో ఈ శిలాద్వీపాన్ని కనుగొన్నాం. మరొకసారి వచ్చి, నిధిని నింపాదిగా వెతికి వెలికి తీయవచ్చు. ఇప్పుడు తిరిగి వెళ్ళిపోదాం,'' అన్నాడొక కుర్రవాడు సమీరుణ్ణి ఓదారుస్తూ.

''అరవకండి!'' అని సైగచేసి, ''ఈ బండ చాటున దాక్కుందాం రండి,'' అంటూ అపూర్వుడు ముందుకునడిచాడు.

క్షణంలో ఏడుగురూ గుట్టు చప్పుడు కాకుండా, పెద్దబండ చాటున దాక్కున్నారు.

బండకవతలి వైపునుంచి, ఎవరో బిగ్గరగా నవ్వడం వినిపించింది. అపూర్వుడు ఆ శబ్దాన్ని జాగ్రత్తగా వినసాగాడు.

''ఈనాటికి, అంటే పది సంవత్సరాల తరవాత, మన కోరిక నెరవేరింది. మన కలలు ఫలించి, నిధి మనవశమయింది. మనకు అడ్డుపడిన శత్రువులు ఈపాటికి నరకంలో ఏడుస్తూ వుంటారు!'' అన్న కఠోర కంఠస్వరం వినిపించింది.

''అందరూ నరకంలో లేరు, గురూ, ఇంకా కొందరు జైళ్ళలోనే ఉన్నారు!'' అన్నాడు మరొకడు నవ్వుతూ.

''ఆలస్యం చేయకండి. త్వరగా మనం నిధిని పడవలోకి చేర్చాలి!'' అని ఆజ్ఞాపించాడు ఒకడు దృఢమైన కంఠస్వరంతో.

''నాకు ఆకలి వేస్తున్నది. మొదట కడుపునిండా తినాలి. ఆ తరవాతే మరొక పని. మన వశమైన నిధి రెక్కలొచ్చి ఎక్కడికీ ఎగిరిపోదులే!'' అన్నాడు ఇంకొకడు.

''ముందు, వచ్చిన పని పూర్తిచేయండి. నిధిని పడవలోకి చేర్చి, ఆ పిమ్మట కావలసినంత తినవచ్చు, తాగవచ్చు!'' అని ఆజ్ఞాపించాడు మొదటివాడు.





అపూర్వుడు బండల మధ్య సందు గుండా తొంగి చూశాడు. బండకు అవతలి వైపున ఐదుగురు దృఢకాయులు నిలబడి ఉన్నారు. నగలు నిండిన పెట్టెలు గుహ లోపలి గోతులలో ఉన్నాయి. సముద్రపు దొంగలు ఆ పెట్టెలను ఒక్కొక్కటిగా వెలుపలికి తీసి, పడవలోకి చేర్చడం కనిపించింది.

వాళ్ళ పని పూర్తికావడానికి అరగంట సేపు పట్టింది.

''సరే, ఇప్పుడు రండి భోజనం చేద్దాం!'' అని ఆజ్ఞాపించాడు వాళ్ళ నాయకుడు.

ఇద్దరు దృఢకాయులు, పాత్రల నిండుగా వున్న వంటకాలనూ, పీపాల నిండా వున్న పానీయాన్నీ పడవ నుంచి దించి, తెచ్చి ఒక చదునైన బండ మీద పెట్టారు. వాటి చుట్టూ కూర్చుని దొంగలు, సంతోషంగా తింటూ, తాగుతూ, ఆడుతూ, పాడుతూ పట్టరాని ఆనందంతో విచ్చల విడిగా ప్రవర్తించసాగారు. కొంత సేపటికి సద్దుమణిగింది. వాళ్ళందరూ స్పృహ కోల్పోయి అలాగే నిద్రపోయారు!

''రండి, మనం తప్పించుకోవడానికిదే సరైన తరుణం!'' అన్నాడు అపూర్వుడు ముందుకు నడుస్తూ.

''గండుమీనాలెక్కడ?'' అన్నాడు ఒక కుర్రవాడు.

"అవి సముద్రంలో హాయిగా ఉన్నాయి. అయినా, మనం ఇప్పుడు అమూల్యమైన నిధిగల ఆ పడవలో ప్రయాణం చేద్దాం!'' అంటూ అపూర్వుడు దొంగలు తెచ్చిన పడవకేసి చేయి చూపుతూ అటుకేసి నడిచాడు.

కుర్రవాళ్ళు అమితోత్సాహంతో పరుగున వెళ్ళి, పడవలోకి ఎక్కారు. మరుక్షణమే గండుమీనాలు వచ్చి, తమ తలలతో పడవను ముందుకు తోశాయి. కుర్రవాళ్ళు తెడ్లను అందుకున్నారు. సముద్రపుదొంగలు తప్పతాగి, స్పృహతప్పి పడిపోయిన శిలా ద్వీపాన్ని వదిలి, పడవ తీరం కేసి వేగంగా కదలసాగింది. —(ఇంకావుంది)



# అపూర్వుడి సాహసయాత్రలు

## 9

[అపూర్వుడనే విచిత్ర వ్యక్తి, సముద్రపు దొంగల పాలైన ఐదుగురు కుర్రవాళ్ళను, సమీరుడి ద్వారా రక్షించి, దొంగలను రాజుగారికి అప్పగించాడు. మరొక ముఠా దొంగలు నిధిని తెచ్చుకోవడానికి శిలాద్వీపానికి చేరి, అక్కడే తాగి మత్తులో పడిపోయారు. అపూర్వుడూ, సమీరుడూ, అతడి మిత్రులూ నిధితోసహా పడవలో బయలుదేరారు. —తరవాత]

కుర్రవాళ్ళు పడవలో తీరం కేసి రావడం, సముద్రతీరంలో చేరిన గ్రామప్రజలు చూశారు. పరమదుర్మార్గులయిన, సముద్రపుదొంగలను ఉపాయంతో బంధించి, రాజుగారికి అప్పగించిన సమీరుడూ, అతడి మిత్రులూ, మళ్ళీ దేని కోసమో సముద్రంలోకి వెళ్ళారన్న వార్త అప్పటికే చుట్టుపక్కల గ్రామాలకు వ్యాపించింది.

పడవను దూరం నుంచి చూసిన గ్రామ ప్రజలు కొందరు, "సమీరుడూ, అతడి మిత్రులూ వస్తున్నారు!" అని ఉత్సాహంగా కేకలు వేస్తూ, ఆ విషయాన్ని అందరికీ తెలియజేయడానికి గ్రామంలోకి పరుగులు తీశారు.

సముద్రతీరానికి కొంతదూరంలో, ఒక అందమైన ఉద్యానవనం మధ్య చిన్న భవనం ఒకటి ఉన్నది. విశ్రాంతి తీసుకోవ



డానికి ఎప్పుడైనా అక్కడికి రావడం రాజుకు అలవాటు. ఇప్పుడు కూడా రాజు ఆ విశ్రాంతి భవనంలోనే విడిది చేశారు. కుర్రవాళ్ళు, తీరం చేరుతున్నారన్న వార్త రాజుకూ అందింది. ఆ కుర్రవాళ్ళ పట్ల, ముఖ్యంగా సమీరుడిపట్ల రాజుకు అమితమైన అభిమానం. అందువల్ల ఆయనకూ వాళ్ళను చూడాలనిపించింది. వెంటనే రాజు గుర్రం మీద సముద్ర తీరానికి బయలుదేరాడు. ఆయన వెంట అంగరక్షకులు వచ్చారు. రాజు సముద్ర తీరం చేరేలోగా, కుర్రవాళ్ళ తల్లిదండ్రులూ, బంధుమిత్రులూ, ఇతర గ్రామస్తులూ అక్కడ చేరారు. వాళ్ళందరూ రాజును చూడగానే గౌరవంతో నమస్కరించారు.

"కుర్రవాళ్ళు ఎక్కడికి వెళ్ళారో తెలుసా?" అని అడిగాడు రాజు గ్రామ పెద్దను.

"తెలియదు ప్రభూ. ఎక్కడికి వెళ్ళారో, ఎందుకు వెళ్ళారో, ఎవరికీ తెలియదు!" అన్నాడు గ్రామపెద్ద వినయంగా.

సముద్రంలో పడవ అంచున కూర్చుని, ప్రయాణం చేస్తూన్న అపూర్వుడు, తీరంలో రాజూ, గ్రామ ప్రజలూ గుమిగూడిన విషయం గ్రహించి, సమీరుడితో "ఇక నేను వెళతాను. రాజు ఉత్తముడు. నువ్వు తీసుకు వెళుతున్న ఈ నిధిని పేద ప్రజల బాధలు పోగొట్టడానికి ఉపయోగించమని రాజుగారితో చెప్పు." అన్నాడు.

సమీరుడు, అపూర్వుడికి భక్తితో నమస్కరించాడు. అయినా, అతని మనసులో అపూర్వుడు అప్పుడే వదిలి వెళుతున్నాడే అని కొంత విచారం కలిగింది. ఆ సంగతి గ్రహించిన అపూర్వుడు, "మిత్రమా, ధైర్యంగా వెళ్ళు. అంతా మంచే జరుగుతుంది. నిధి దొరికిందన్న ఆనందంలో, శిలాద్వీపంలో స్పృహతప్పి పడిపోయిన దొంగలను గురించి మరిచిపోవద్దుసుమా! వాళ్ళను అలాగే వదిలేస్తే మరణించ

గలరు. వాళ్ళను కాపాడమని రాజుగారికి చెప్పు." అంటూ పడవపై నుంచి, పక్కనే ఈదుతూ వస్తున్న గండుమీనం మీదికి ఉరికాడు. వెంటనే ఆ గండుమీనం పడవ నుంచి దూరంగా, వెళ్ళసాగింది. సమీరుడు అటుకేసి తిరిగి చూశాడు. రెప్ప పాటులో అది అమిత వేగంతో బాణంలా దూసుకు పోసాగింది!

పడవ, నది సముద్రంలో కలుస్తున్న ప్రాంతాన్ని చేరింది. అలలు తక్కువగా ఉండడంవల్ల, అక్కడి జలం ప్రశాంతంగా ఉన్నది. దృఢకాయులయిన గ్రామస్తులు కొందరు నీళ్ళలోకి దిగి, కుర్రవాళ్ళు పడవలో నుంచి, గట్టు చేరడానికి సాయపడ్డారు.

సమీరుడు రాజుకు నమస్కరించి, దొంగలు దాచిన నిధిని ఎలా తీసుకు వచ్చిందీ ఆయనకు క్లుప్తంగా చెప్పాడు. పడవ దగ్గరికి వెళ్ళి, పెట్టెలనిండా వున్న నగలనూ, విలువైన ఆభరణాలనూ చూసిన రాజు, ఆనందాశ్చర్యాలకు అవధులు లేవు. ఆ నిధిని పేదల బాధలు పోగొట్టడానికి, ఉపయోగించగలమని, సమీరుడికి ఆయన హామీ ఇచ్చాడు. అందుకు తగిన పథకాలు ఆలోచించమని, రాజు సమీరుణ్ణి కోరాడు.

"ప్రభూ, ఈ నిధిని తమ విశ్రాంతి భవనంలోనే దాచండి. అది అక్కడే సురక్షితంగా ఉంటుంది," అన్నాడు సమీరుడు.





విధించవలసి వుంటుంది. ఎందరెందరో అమాయకులను, హింసించి చంపి, ఎన్నో కుటుంబాలనుసర్వనాశనంచేసినఆపరమ కిరాతకులకు అది సరైన శిక్షే అవుతుంది. సరే, నీ ఇష్టానుసారం, వాళ్ళను మొదట ఇక్కడికి తీసుకువద్దాం. ఆ తరవాత న్యాయసమ్మతమైన శిక్ష వేద్దాం,'' అని రాజు, అంగరక్షకులవైపు తిరిగి, వాళ్ళల్లో ఒకడి ద్వారా రాజధానికి సందేశం పంపాడు.

ఆ తరవాత రాజాజ్ఞప్రకారం, నిధిని భటులు రాజుగారి విశ్రాంతి భవనంలోకి తరలించారు.

''అలాగే చేద్దాం,'' అన్నాడు రాజు తల పంకిస్తూ.

''మరొక ముఖ్య విషయం ప్రభూ,'' అన్నాడు సమీరుడు.

''ఏమిటి?'' అని అడిగాడు రాజు.

''శిలాద్వీపంలో చిక్కుకుపోయిన సముద్రపు దొంగలను అక్కడి నుంచి తీసుకురావాలి!'' అన్నాడు సమీరుడు.

''ఎందుకూ? వాళ్ళను అక్కడే వదిలేస్తే ఏం?'' అని అడిగాడు రాజు.

''చచ్చిపోతారు ప్రభూ!'' అన్నాడు సమీరుడు.

''వాళ్ళను అక్కడి నుంచి కాపాడి తీసుకువచ్చినా, వాళ్ళకు మరణశిక్షే

మధ్యాహ్నానికి రాజధాని నుంచి యాభై మంది సైనికులతో, రెండు పెద్ద పడవలు నదీ సంగమం దగ్గరికి వచ్చి చేరాయి. సమీరుడూ, అతడి మిత్రులూ, సైనికులకు శిలాద్వీపానికి దారి చూపడానికి ముందుకు వచ్చారు. ఖాళీగా వున్న తాము వచ్చిన దొంగల పడవలో, సమీరుడూ, అతడి మిత్రులూ, సేనానాయకుడూ ఎక్కి కూర్చున్నారు. వాళ్ళ పడవముందూ, దాని వెనక సైనికులున్న రెండు పడవలూ శిలాద్వీపం కేసి బయలుదేరాయి.

వాళ్ళు శిలాద్వీపాన్ని సమీపిస్తూండగా, అప్పుడే తెల్లవారుతున్నది. పడవలను

ఎక్కడ ఆపి, లంగరు దించాలో సమీరుడు సూచించాడు. అక్కడికి కొన్ని గజాల దూరంలోనే పెద్ద పెద్ద బండలు ఉన్నాయి.

హఠాత్తుగా ఒక రాయి దూసుకువచ్చి, సమీరుడి దగ్గర నిలబడిన సేనానాయకుడి పక్కన పడింది! దాని నుంచి చప్పున పక్కకు తప్పుకున్న సేనానాయకుడు, "ఆ మూర్ఖులు మనల్ని ఎదిరించాలనుకుంటున్నారు!" అని, బండల కేసి తిరిగి, "మీరు ఎంత పోరాడినా, మా నుంచి తప్పించుకోలేరు. మీరు ఐదుగురే వున్నారు. మేము యాభై మంది సైనికులం వచ్చాం. మర్యాదగా లొంగిపోండి. నా మాట విని, లొంగిపోయారంటే, మీకు విధించే శిక్ష కూడా అంత కఠినంగా వుండదు. ఎదురు తిరిగారో, చావు తప్పదు!" అని గంభీర స్వరంతో గట్టిగా హెచ్చరించాడు.

అయినా, రాళ్ళు బాణాల్లా రివ్వు రివ్వున వచ్చి పడసాగాయి. రాను, రానూ వాటి ఉధృతం ఎక్కువయింది.

"ఊఁ....వదలండి!" అని ఆజ్ఞాపించాడు సేనానాయకుడు.

మరుక్షణమే, రాళ్ళు వస్తూన్న దిక్కు కేసి ఒక్కసారిగా యాభై బాణాలు దూసుకు పోయాయి!

అటుపైన రాళ్ళు పడడం ఆగిపోయింది. పడవలు, సులభంగా బండలను సమీపించాయి!





కాపలాగా వుంచి, మిగతా నలభైమందిని, ఐదుగురు చొప్పున ఎనిమిది జట్లుగా విడదీసి, వాళ్ళను ద్వీపాన్ని ఒక్కసారిగా చుట్టుముట్టి, గుహలన్నిటినీ వెదకమని ఆజ్ఞాపించాడు.

సమీరుడూ, అతడి మిత్రులూ పడవలో నిలబడి, జరుగుతూన్న దానిని అమితాసక్తితో చూడసాగారు.

''సమీరా!'' అన్న మధుర కంఠస్వరం విని సమీరుడు ఉలిక్కిపడి, ఆ పిలుపు వినిపించిన దిక్కుకేసి చూశాడు.

అపూర్వుడు ఒక బండమీద చిన్నగా నవ్వుతూ నిలబడి వున్నాడు.

''సముద్రపు దొంగలు, ద్వీపం తూరుపు దిక్కున ఉన్న సొరంగంలో దాక్కొని వున్నారు. కాలయాపన కాకుండా, ఆ సొరంగాన్ని వెతికించమని సేనానాయకుడితో చెప్పు,'' అన్నాడు అపూర్వుడు.

సమీరుడు అమితోత్సాహంతో, పడవలో నుంచి, కిందికి దూకి, క్షణంలో సేనానాయకుణ్ణి సమీపించాడు.

''నిన్ను పడవలోనే ఉండమన్నాను కదా ఎందుకిలా వచ్చావు?'' అన్నాడు సేనానాయకుడు ఆప్యాయంగా.

''నిజమే. అయినా, మీకొక ముఖ్యమైన విషయం చెప్పవలసి వచ్చింది. దొంగలు అయిదుగురూ, ద్వీపం తూరుపు దిక్కున

సేనానాయకుడు సమీరుడితో, ''ఆ దొంగల కంటబడకుండా నువ్వూ, నీ మిత్రులూ ఇక్కడే పడవలో కూర్చోండి. మేము ఆ దుర్మార్గులను పట్టి బంధిస్తాం!'' అంటూ కిందికి దిగాడు.

సేనానాయకుడు లొంగిపొమ్మని మళ్ళీ ఒకసారి దొంగలను గట్టిగా హెచ్చరించాడు. అయినా, అటువైపు నుంచి సమాధానం ఏదీ రాలేదు. సైనికులు ఎత్తయిన బండల పైకి ఎక్కి చూశారు. కాని, దొంగలజాడ లేదు.

''వాళ్ళు ఏ గుహలోనో దాక్కొని వుంటారు!'' అని సేనానాయకుడు, పది మంది సైనికులను ద్వీపముఖంలో





వున్న సొరంగంలో దాక్కొని ఉన్నారు,'' అన్నాడు సమీరుడు.

''ఆ సంగతి నీకెలా తెలిసింది?'' అని అడిగాడు సేనానాయకుడు.

''మొదట నిధిని ఎలా కనుగొన్నానో, దొంగల నుంచి ఎలా తప్పించుకున్నానో, అలాగే ఇప్పుడు ఇది కూడా తెలిసింది!'' అన్నాడు సమీరుడు చిన్నగా నవ్వుతూ.

సమీరుడు నిజమే చెబుతున్నాడని గ్రహించాడు సేనానాయకుడు. వెంటనే అతడు పదిమంది సైనికులను సమీరుడు సూచించిన సొరంగం కేసి నడిపించాడు. సొరంగద్వారం సమీపించగానే, ''మీరు దాక్కున్న స్థలం తెలిసిపోయింది. ఇప్పటయినా గుట్టుగా లొంగిపోతారా? లేక మాచేత చావాలనుకుంటున్నారా?'' అని హెచ్చరించాడు సేనానాయకుడు మళ్ళీ.

''చావు మాకు కాదు; మీకు. ఎవరైనా సొరంగంలోకి అడుగు పెట్టారో, ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!'' అని హెచ్చరించాడు, సొరంగంలోని దొంగలనాయకుడు.

మరుక్షణమే సొరంగంలో, ఆ చివరి నుంచి భయంకర కంఠస్వరం వినిపించింది: ''ఈ సొరంగం భయంకరమైన త్రాచుపాములకు నిలయం. మీరిక్కడ ఇంకొక్క నిముషం ఆగారో భయంకరమైన చావు తప్పదు!''

త్రాచుపాములకన్నా భయంకరంగా ఉన్న ఆ కంఠస్వరం విని దొంగలు గడగడ వణికిపోయారు. త్రాచులకు నిలయమైన ఈ చీకటి సొరంగంలోకి మానవమాత్రుడెలా వచ్చాడు? ఇది గుహను ఆవహించిన భూతం హెచ్చరిక కాదు కదా! అని హడలిపోయారు వాళ్ళు.

''లొంగిపోదాం!'' అన్నాడు దొంగల నాయకుడు.

దొంగలు ఒక్కొక్కరుగా, సొరంగం నుంచి, చేతులు పైకెత్తి మెల్లగా బయటకు రాసాగారు. తలలు వంచుకుని, నిలువెల్లా వణికిపోతూ సేనానాయకుడి ఎదట నిలబడిన దొంగల రెక్కలు విరిచికట్టారు సైనికులు. —(ఇంకావుంది)



# అపూర్వుడి సాహసయాత్రలు

## 10

[అపూర్వుడు, సమీరుణ్ణి బందిపోటు దొంగలనుంచి రక్షించాడు. అపూర్వుడి ఆదేశానుసారం సమీరుడు, సముద్రపు దొంగల పాలయిన ఐదుగురు కుర్రవాళ్ళను కాపాడాడు. శిలాద్వీపంలో దొంగలు దాచిన నిధిని, అపూర్వుడి కోరిక మేరకు ప్రజోపయోగ కార్యాలకు ఉపయోగించమని, సమీరుడు రాజుకు అప్పగించాడు. సముద్రపు దొంగలు బందీలయ్యారు.—తరవాత]

దారిదోపిడీలు జరిపే బందిపోటు దొంగలూ, వర్తకుల ఓడలను దోచుకునే సముద్రపు దొంగలూ బందీలుగా పట్టుబడడంతో రాజ్యంలో దొంగల భయం తొలగిపోయింది. అద్భుత శక్తులుగల దివ్యపురుషుడెవరో, మంచివారికి రక్షణగా ఉన్నాడన్న వదంతి పుట్టడంవల్ల, దుర్మార్గుల దుండగాలు తగ్గాయి. ధర్మవర్తనుడయిన రాజు, సమీరుణ్ణి తన సలహాదారుగా నియమించుకున్నాడు. రాజ్యంలో ఎలాంటి సమస్యలూ లేకుండా కొంతకాలం జరిగింది.

అపూర్వుడు హిమాలయాలను చేరి సదానందముని తపస్సు చేసుకుంటూన్న గుహ సమీపంలోనే ధ్యానంలో గడపసాగాడు. ఈ విషయం ఒక్క సమీరుడికి మాత్రమే తెలుసు. ఏకాగ్రచిత్తంతో ఎప్పుడు తలుచుకున్నా మరుక్షణమే ఎదట ప్రత్యక్ష







మయ్యేటట్టు, అపూర్వుడు సమీరుడికి వరమిచ్చి వెళ్ళాడు.

ఒకనాడు, హిమాలయాలలోని సదానందముని, అపూర్వుణ్ణి దగ్గరికి పిలిచి, "నాయనా, నీకు పూర్వం, మహానుభావులైన ఎందరో మునులూ, యోగులూ కఠినమైన తపస్సు ఆచరించి యోగవిద్యలెన్నిటినో అభ్యసించి, పరిపూర్ణత సాధించారు. వాటినే నువ్వు మళ్ళీ ఇప్పుడు ఆచరించవలసిన అవసరం లేదు. అయితే, విశిష్టమైన కర్తవ్యాన్ని నిర్వర్తించవలసిన ముఖ్యమైన బాధ్యత నీకున్నది. నేను సాధించిన యోగశక్తిలో కొంత నీకు ప్రసాదిస్తున్నాను. దానిని నువ్వు మానవ జాతి అభ్యుదయానికి ఉపయోగించాలి!" అన్నాడు.

"నేను మొదటినుంచి చేస్తున్నది అదే కదా! తమ కోరికకు భిన్నంగా ప్రవర్తించి, నేను తమకు నిరాశ కలిగించలేదుకదా!" అన్నాడు అపూర్వుడు వినయంగా.

"లేదు. నాయనా, నా సంకల్పాలన్నిటినీ నువ్వు నెరవేర్చావు. నిన్ను చూస్తూంటే ఆనందంగా ఉన్నది!" అన్నాడు ముని.

"ధన్యుణ్ణి, మహాత్మా! ప్రస్తుతం రాజ్యంలో అన్నీ సవ్యంగానే సాగుతున్నవి. చిన్న చిన్న సమస్యలున్నాయి. అయితే, ప్రజలే వాటిని పరిష్కరించుకోవాలి. మానవ జీవితంలో ప్రయత్నం ప్రధానం కదా! పోరాడితేగాని అభివృద్ధి సాధించలేమన్న విషయం మీకు తెలియనిదా, మహాత్మా!" అన్నాడు అపూర్వుడు.

"నీ వన్నది నిజమే. అయినా, మానవ స్వభావం చాలా క్లిష్టమైనది. శాంతియుతంగా జీవితం సాగించడం కొందరికి సాధ్యపడదు. ఎప్పుడూ, ఏదో ఒక సమస్య కావాలి. అప్పుడుగాని అలాంటి వాళ్ళకు నిద్రపట్టదు!" అన్నాడు ముని.

అపూర్వుడు మునికేసి, ఆదుర్దాగా చూస్తూ, "అంటే, అలాంటి వ్యక్తులెవరైనా ప్రస్తుతం దురాగతాలకు పూనుకుంటున్నారా?" అని అడిగాడు.





"అవును, నాయనా, అలాంటి వాళ్ళు. నువ్వు మంచి మార్గానికి మళ్ళించిన బందిపోట్లూ, సముద్రపుదొంగలకన్నా అపాయకరమైనవాళ్ళు. బందిపోట్లూ, దొంగలూ మామూలు మనుషులు. అయితే, ఇప్పుడు నేను చెబుతూన్న వ్యక్తులు సమాజంలో పెద్ద మనుషులు. కొందరికి కావలసినంత అధికార బలం వున్నది. మరికొందరికి అత్యధికమైన ధన బలం ఉన్నది. ఇంకా కొందరికి అపరిమితమైనబుద్ధిబలంకూడా ఉన్నది!" అన్నాడు ముని నిట్టూరుస్తూ.

"వాళ్ళు ఇప్పుడేం చేయనున్నారు?" అని అడిగాడు అపూర్వుడు ఆదుర్దాగా.

"ఆ సంగతి నువ్వే కనిపెట్టాలి. నేనొక సారి మానవజాతి భవిష్యత్తు గురించి ఆలోచిస్తూ, అలాగే ధ్యానావస్థలోకి వెళ్లాను. అప్పుడు నా దివ్యదృష్టికి ఒక దృశ్యం గోచరించింది. ఇద్దరు పెద్దమనుషులు ఏదో అపవిత్ర కార్యం గురించి రహస్యంగా ఆలోచించడం తెలియవచ్చింది. ఆ ఇద్దరిలో ఒకరిని మాత్రం నేనెరుగుదును. అతడు రుద్రపురి ప్రధాన మంత్రి. వారిరువురూ రేపురాత్రికి మళ్ళీ రహస్యాలోచన జరుపనున్నట్లు తెలిసింది. కాని, వాళ్ళ పథకం వివరాలు తెలియలేదు. నువ్వు ప్రధానమంత్రి ఇంటికి వెళ్ళి, అక్కడి పరిస్థితుల గురించీ, వాళ్ళ దుష్టపథకం



గురించీ తెలుసుకోవాలి!" అని చెప్పి సదానందముని అపూర్వుణ్ణి ఆశీర్వదించాడు.

* * *

సాయంకాలమయింది. రుద్రపురిలోని దేవాలయాలలో గంటానాదాలూ, శంఖారావాలూ మారుమోగాయి. రాజప్రాసాదానికీ, ప్రధానమంత్రి భవనానికీ మధ్య బ్రహ్మాండమైన వటవృక్షం ఒకటి ఉన్నది. ఆ వటవృక్షం కొమ్మల చాటున దాక్కున్న అపూర్వుడు, ప్రధానమంత్రి భవనంలోకి ప్రవేశించడానికి అవకాశంకోసం ఎదురు చూస్తున్నాడు.

రాజప్రాసాదం ముందు కొందరు ఆనందోత్సాహాలతో ఏవో మాట్లాడుకుంటూ





అటూ ఇటూ హడావుడిగా తిరుగుతున్నారు. అటుగా వచ్చిన ఒక వ్యక్తి, ఎదురుపడిన రాజోద్యోగిని, "ఏమిటి విశేషం? ఎందుకీ హడావుడి?" అని అడిగాడు.

"మన యువరాణి కృష్ణకుమారిగారు లావణ్యపురినుంచి తిరిగివస్తున్నారు. ఆమె తన మేనమామ లావణ్యపురి రాజు జయవర్మ దగ్గరికి వెళ్ళి ఆరునెలల తరవాత ఇప్పుడే వస్తున్నారు. అందుకే ఈ కోలాహలం!" అన్నాడు రాజోద్యోగి.

మరి కొంతసేపటికి చక్కగా అలంకరించిన అందమైన ఏనుగు అంబారీ మీద, బంగారు గొడుగు నీడన యువరాణి కృష్ణకుమారి రాజప్రాసాదాన్ని సమీపించింది.

ఆమె ఎక్కిన ఏనుగుకు ముందూ, వెనకా రెండు ఏనుగుల మీద నలుగురేసి చెలికత్తెలు కూర్చున్నారు. ఏనుగులకు ముందూ, వెనకా ఇరువైపులా గుర్రాలమీద రక్షకభటులు వచ్చారు.

ముందు చెలికత్తెలు దిగి, యువరాణి వున్న ఏనుగు దగ్గరికి వెళ్ళారు. మావటివాడి సూచన ప్రకారం, యువరాణి ఏనుగు మెల్లగా కిందికి వంగింది. భటులు ఒక మెత్తటి ఆసనాన్ని తెచ్చి ఏనుగు పక్కన వేశారు. యువరాణి ఆసనం మీదికి దిగి, ఆ తరవాత నేలపై అడుగుపెట్టింది.

అప్పటికే అక్కడికి చేరిన రాజు విశ్వవర్మ మందహాసంతో కుమార్తెకు ఎదురు వచ్చాడు. తండ్రి కనిపించగానే యువరాణి అనురాగంతో చేతులు సాచింది.

"రా, తల్లీ," అంటూ రాజు ఆమెను ఆప్యాయంగా పలకరించాడు.

యువరాణి కృష్ణకుమారి రుద్రపురి రాజు విశ్వవర్మ ఏకైక సంతానం. యువరాణి పసిపాపగా ఉన్నప్పుడే తల్లి మరణించింది, కాని, రాజు ఆ తరవాత వివాహమాడడానికి అంగీకరించలేదు. రుద్రపురికి పొరుగు రాజ్యమైన లావణ్యపురి రాజు జయవర్మ, యువరాణికి మేనమామ. ఆయనకు సంతానం లేదు. కాబట్టి ఆయన తన సోదరి కుమార్తెను తన కుమార్తెలా



భావించసాగాడు. సోదరి మరణించడంతో ఆ అభిమానం ఇనుమడించింది. అందు వల్ల ప్రస్తుతం యువరాణి కృష్ణకుమారి ఇరుగుపొరుగు రాజ్యాలయిన రుద్రపురికీ, లావణ్యపురికీ ఏకైక వారసురాలు! మేనమామ జయవర్మను తండ్రిలాగానూ, లావణ్యపురిని తన సొంత రాజ్యంలాగానూ ఆమె భావిస్తుంది. అందుకే అక్కడ ఆరు నెలలు గడిపి తిరిగివస్తున్నది!

యువరాణి మెడలో ముత్యాలహారం మధ్య మిరమిట్లు గొలుపుతూన్న అద్భుత మణిని చూసి, రాజు, "ఏమిటిది?" అని అడిగాడు అమితాశ్చర్యంతో.

"నేను లావణ్యపురి నుంచి మరింత సంపన్నురాలిగా తిరిగివచ్చాను, నాన్నా!" అన్నది యువరాణి.

రాజు ఆమె కంఠహారంలోని మణిని చేతితో తాకి, పరిశీలనగా చూస్తూ, "ఇది అద్భుతమైన చంద్రకాంతమణి కాదు కదా?" అని అడిగాడు.

"అవును నాన్నా, ఇది చంద్రకాంతమణే. దీనిని ఎంతకాలమని అలంకరించుకోకుండా ఖజానాలో దాచడం? పైగా, ఇప్పుడు మన రెండు రాజ్యాలలోనూ, శాంతి భద్రతలకు లోటు లేదు. అందువల్ల, ఇదే శుభతరుణంగా భావించి, మామ చంద్రకాంతమణితో ఒక ప్రత్యేక హారం



చేయించి నా మెడలో వేశాడు. బావుందా నాన్నా!" అని అడిగింది యువరాణి.

"మీ మామ చాలా గొప్పవాడు తల్లీ," అంటూ రాజు యువరాణిని ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్నాడు.

* * *

"ఇన్నాళ్ళూ నీకంటబడకుండా దూరంగా వున్న అదృష్టం, ఇప్పుడు నిన్ను సమీపించనున్నది. చేయిసాచి అందుకోవడమే తరువాయి!" అన్నాడు మాంత్రికుడు పరమానందంతో.

ప్రధాని మౌనంగా వింటున్నాడు.

"అయితే, అదృష్టం దానంతట అదే నీ దగ్గరికి వచ్చిందనుకుంటున్నావేమో!



అది నిజం కాదు. నేను నా మంత్రశక్తిని ప్రయోగించాను. లావణ్యపురి రాజు మనసు మార్చాను. ఆయనకు తెలియకుండానే, ఆయన మనసులో, చంద్రకాంతమణిని యువరాణి కృష్ణకుమారి మెడలో వేయాలన్న కోరికను పుట్టించాను," అన్నాడు మాంత్రికుడు గర్వంగా మునివేళ్ళతో గడ్డం దువ్వుకుంటూ.

"అలాగా! మీ శక్తిని నేనెరుగుదును మహాత్మా!" అన్నాడు ప్రధానమంత్రి.

మాంత్రికుడు మహాత్ముడా? పరమ దుర్మార్గుడు! అనుకున్నాడు చాటునుంచి వాళ్ళ సంభాషణలు వింటూన్న అపూర్వుడు.

"జయవర్మకుగాని, విశ్వవర్మకుగానీ, చంద్రకాంతమణి గొప్పదనం తెలియక పోవడం మన అదృష్టం. ప్రపంచంలోని విలువైన మణులలో అదొక్కటి అన్న విషయం మాత్రమే వాళ్ళకు తెలుసు. ఆ మణి అద్భుతశక్తులను గురించి వాళ్ళ కేమాత్రం తెలియదు," అని బిగ్గరగా నవ్వబోయి, చప్పున ఆపుకున్నాడు మాంత్రికుడు.

దాదాపు గంటసేపు వాళ్ళిరువురు రహస్య ఆలోచనలు జరిపారు. వాళ్ళ సంభాషణలు విన్న అపూర్వుడికి అక్కడి విషయాలన్నీ అర్థమయ్యాయి. ప్రధాన మంత్రీ, మాంత్రికుడూ చిన్ననాటి స్నేహితులు. బాల్యంలో వాళ్ళిద్దరూ ఒకే గురుకులంలో ఒకే గురువు వద్ద విద్యనభ్యసించారు. వాళ్ళ గురువుకు గురువు, అద్భుతశక్తులు గల చంద్రకాంతమణిని, ఆనాటి లావణ్యపురి రాజైన ఈనాటి జయవర్మ తాతకు బహూకరించాడు. ఆ రోజు నుంచి మూడు తరాలుగా, లావణ్యపురి రాజకుటుంబానికి చెందిన ఖజానాలోనే ఆ చంద్రకాంతమణి పడి ఉన్నది!

మాంత్రికుడు ఒకనాడు ప్రాచీన తాళపత్ర గ్రంథాలను పరిశీలిస్తుండగా ఒక రహస్యం బయటపడింది. చంద్రకాంతమణి అద్భుతశక్తులు గలదనీ, దానిని





ధరించి, కొన్ని ప్రత్యేకపూజలు జరిపినట్టయితే, రాజులందరికీ చక్రవర్తి కావచ్చునన్న విషయం తెలిసింది. ఆ క్షణం నుంచి, ఆ చంద్రకాంతమణిని ఎలాగైనా తన కైవసం చేసుకోవాలని మాంత్రికుడు తెగ ఆలోచిస్తున్నాడు. వాడు లావణ్యపురి రాజు జయవర్మను దర్శించి, యువరాణి కృష్ణకుమారి దుష్టశక్తి ప్రభావానికి లోనైవున్నదనీ, ఆమెను రక్షించుకోవాలంటే, ఆమె మెడలో విలువయిన మణిహారం వేయాలనీ చెప్పాడు. మేనకోడలి మీది అభిమానం కారణంగా, జయవర్మ వెంటనే, చంద్రకాంతమణి పొదిగిన హారాన్ని ఆమె మెడలో వేశాడు. అయితే, ఆయన దుష్టశక్తి ప్రభావం విషయం ఆమెకు చెప్పలేదు.

తన మంత్రశక్తిని ప్రయోగించి జయవర్మ మనసులో మార్పు తెచ్చాననీ, అందుకే ఆయన విలువయిన చంద్రకాంతమణిని వదులుకోవడానికి సిద్ధపడ్డాడనీ, మాంత్రికుడు ప్రధానమంత్రికి కల్పించి చెప్పాడు. మంత్రి ఆ మాటలు నమ్మాడు. మంత్రవేత్త అయిన తన స్నేహితుడి సహాయంతో, తాను గొప్ప చక్రవర్తి కావాలని, ప్రధాని కలలు కనసాగాడు. అయితే, చంద్రకాంతమణి చేతికి రాగానే, ప్రత్యేకపూజలు చేయించాలన్న సాకుతో దానిని అపహరించి, తనే చక్రవర్తి కావాలని మాంత్రికుడు పథకం వేశాడన్న సంగతి ప్రధాని గ్రహించలేకపోయాడు!

మనుషుల కళ్ళలోకి చూసి వారి స్వభావాలను తెలుసుకోగలశక్తి అపూర్వుడికి ఉన్నది. ప్రధానమంత్రి మూర్ఖుడే కాని, మాంత్రికుడు కరుడుగట్టిన స్వార్థపరుడనీ, తన స్వార్థం కోసం ఎంతకైనా తెగించగల దుర్మార్గుడనీ అపూర్వుడు గ్రహించాడు. అటువంటి దుర్మార్గుడు చక్రవర్తి అయితే, మానవజాతి మనుగడ ఏమవుతుంది? మంచివాళ్ళ భవిష్యత్తు ఏమవుతుంది? అని అపూర్వుడు ఆలోచించసాగాడు. —(ఇంకావుంది)








## 11

[సదానందముని ఆదేశానుసారం, దుర్మార్గులను ఎదిరించడానికి అపూర్వుడు హిమాలయాల నుంచి రుద్రపురికి వచ్చాడు. రుద్రపురి యువరాణి కృష్ణకుమారి కంఠహారంలోని మహిమగల చంద్రకాంతమణిని కాజేయడానికి, దుష్టమాంత్రికుడు తన బాల్యమిత్రుడయిన ప్రధానమంత్రితో రహస్యాలోచన జరపడం, అపూర్వుడు చాటునుంచి విన్నాడు.—తరవాత]

మాంత్రికుడు ప్రధానమంత్రి భవనం నుంచి, వెలుపలికి వచ్చేసరికి అర్ధరాత్రి అయింది. వాడు నల్లటిదుస్తులు ధరించడంవల్లా, నల్లటిజుట్టూ, పొడవాటి గడ్డం కారణంగా చీకటిలో చీకటిగా నడవసాగాడు.

చంద్రకాంతమణితో మాంత్రికుడు ఎటువంటి పూజలు చేయనున్నాడు? ఆ పూజా విధానాలను వాడు ఎవరినుంచి నేర్చుకున్నాడు? ఎప్పుడు చేస్తాడు? మొదలైన విషయాలను తెలుసుకోవాలన్న ఉత్సాహంతో, అపూర్వుడు మాంత్రికుడికి వెనకగా, కొంతదూరంలో, అడుగుల చప్పుడు వినిపించకుండా నడవసాగాడు. తన వెంట మరొకరు వస్తున్నారన్న విషయం మాంత్రికుడికి తెలియదు.

నగరం పొలిమేర దాటాక, దారిపక్కన వున్న ఒక పొదలోనుంచి, బలమైన ఎలుగు







బంటి ఒకటి వచ్చి, మాంత్రికుడి ముందు వంగింది. మాంత్రికుడు దాని వీపుమీద కూర్చున్న తరవాత, అది అమితవేగంతో అరణ్యంకేసి పరిగెత్త సాగింది. వేగంగా పరిగెత్తడం అపూర్వుడికి కొత్త కాదు గనక, అతడు దాన్ని వెంబడించి పరిగెత్త సాగాడు!

కొంతసేపటికి వాళ్ళు అడవిలోని ఒక చిన్న నదీతీరం సమీపించారు. ఎలుగుబంటి వీపు మీది నుంచి కిందికి దిగిన మాంత్రికుడు దాని చెవులు పట్టుకుని గట్టిగా మెలిపెడుతూ, "మూర్ఖుడా, పరిగెత్తడం కూడా మరిచిపోయినట్టున్నావు, ఛీ ఛీ! వెళ్ళి, బేతాళ వటవృక్షం దగ్గర వుండు. నేను వస్తాను," అని ఆజ్ఞాపించాడు కోపంగా.

ఎలుగుబంటి సరేనన్నట్టు గుర్రుపెట్టి, వెనుదిరిగి వెళ్ళి చీకటిలో కలిసిపోయింది. ఆ మృగం పరిస్థితి చూసి, అపూర్వుడికి జాలి కలిగింది. అతడు కూడా ఒక్కొక్కసారి జంతువులపై ప్రయాణం చేయడం కద్దు. అయినా, అతడు జంతువులను బెదిరించడు, హింసించడు. ప్రేమతో, కృతజ్ఞతగా నడుచుకుంటాడు. అందువల్ల జంతువులు కూడా అతనిపట్ల ఎంతో అప్యాయతను కనబరుస్తాయి. అయితే, ఈ మాంత్రికుడు ఎలుగుబంటిని మంత్ర ప్రభావంతో లొంగదీసుకుని, హింసించి దాని చేత ఊడిగం చేయించుకుంటున్నాడు!

మాంత్రికుడు నదిని సమీపించి, ఏదో మంత్రం పఠిస్తూ మూడుసార్లు చప్పట్లు చరిచాడు. కొంతసేపటికి నదిలో దూరంగా నీళ్ళను పైకి చిమ్ముతూ, ఒక పెద్ద మొసలి పైకి లేచి మాంత్రికుడు నిలబడి వున్న ఒడ్డుకేసి ఈదుకుంటూ వచ్చింది. దగ్గరికి రాగానే, మాంత్రికుడు ఎగిరి దాని వీపు మీద కూర్చుని, "ఊం, వేగంగా పో!" అని ఆజ్ఞాపించాడు.

మొసలి పడమటి దిశగా ఈదుకుంటూ బాణంలా దూసుకుపోసాగింది. దానిని





పాయ ఇరువైపులా కొండలుగల ఒక ఇరుకైన సొరంగ మార్గంలోకి ప్రవేశించింది. అది చిమ్మచీకటి కమ్ముకున్న సొరంగ మార్గం. మొసలి సొరంగంలోకి సునాయాసంగా ప్రవేశించింది. అంతవరకూ నది ఒడ్డున పరిగెత్తుతూన్న అపూర్వుడు, నీళ్ళలోకి దూకి, మొసలిని అనుసరించి, ఈదుకుంటూ వెళ్ళసాగాడు.

మొసలి ఒక గుహ ముఖద్వారం దగ్గరికి వెళ్ళి ఆగింది. వెంటనే మాంత్రికుడు దాని వీపు మీది నుంచి ఒక్క గెంతులో దాపులనున్న పెద్ద బండ మీదికి ఎగిరి దూకాడు.

అనుసరించి, అపూర్వుడు కూడా ఒడ్డు మీద పరిగెత్తసాగాడు.

ఆకాశంలో రేఖామాత్రంగా నేచంద్రుడు కనిపిస్తున్నాడు. అక్కడక్కడా చుక్కలు మెరుస్తున్నాయి. నదికి రెండు వైపులా పొదలనుంచి, నక్కల ఊళలూ, గుడ్లగూబల అరుపులూ వినిపిస్తున్నాయి. అప్పుడప్పుడు దూరంనుంచి పులి గాండ్రింపు వినిపిస్తున్నది. అయినా, భయం అంటే ఎరుగని అపూర్వుడు, వాటినంతా లెక్కచేయకుండా, మాంత్రికుణ్ణి వెంబడించి పరిగెత్తసాగాడు.

అలా చాలా దూరం వెళ్ళాక, నది రెండు పాయలుగా చీలి, అందులో ఒక

''ఎవరక్కడ?'' అన్న అతి భయంకరమైన కీచు కంఠస్వరం గుహలోపలినుంచి వినిపించింది. అటువంటి వింత కంఠస్వరాన్ని అపూర్వుడు అంతకుముందెన్నడూ వినలేదు. అదొక ముసలిదాని కంఠస్వరమై వుంటుందని అతడు ఊహించాడు.

''నీ భృత్యుడైన వీరవికటుణ్ణి, నేను! లోపలికి రావచ్చా?'' అన్నాడు మాంత్రికుడు.

''నువ్వు సరే, మరి నీ వెంట ఉన్నవాడెవడు?'' అని గద్దించిందా కంఠస్వరం.

''నేనూ, మొసలీ తప్ప మూడో ప్రాణి లేదు, తల్లీ!'' అన్నాడు మాంత్రికుడు.





"మూర్ఖుడా! చుట్టుపక్కల జాగ్రత్తగా చూడు!" అని కోపంగా హెచ్చరించిందా కంఠస్వరం.

గుహలోని మాయదారి ముసలిది— తాను ఇక్కడ వున్న సంగతిని పసిగట్టగల శక్తిగలిగినదని అపూర్వుడు గ్రహించాడు. వెంటనే అతడు గురువు ఉపదేశించిన అదృశ్యకరణి మంత్రాన్ని పఠించి, ఎవరికీ కనిపించకుండా మాయమైపోయాడు!



మాంత్రికుడు సొరంగమంతా పరిశీలనగా చూశాడు. కాని వాడి కంటికి ఎవరూ కనిపించలేదు!

"లేదు తల్లీ, లేదు! ఈ పరిసర ప్రాంతాలలో నేనూ, మొసలీ తప్ప మూడో జీవం లేదు!" అన్నాడు మాంత్రికుడు.

"అలాగా! అయితే రా," అని ఆజ్ఞాపించిందా కంఠస్వరం.

వీరవికటుడు గుహ లోపలికి అడుగు పెట్టాడు.

అపూర్వుడు మెల్లగా మరొక బండ మీదికి ఎక్కి, ముసలిది ఉన్న గుహకేసి, పాచిపట్టి జారుతూన్న బండలమీదుగా జాగ్రత్తగా పాకుతూ వెళ్ళసాగాడు.

మానవకపాలంలో రగులుతూన్న ఒక విధమైన మంట, గుహలో పసుపుపచ్చ కాంతిని కలిగిస్తున్నది. ముసలి మంత్రగత్తె గుహలోని గోడకు అనుకుని కాళ్ళు బార్లా చాపుకుని కూర్చుని ఉన్నది. ఆమె వయసు ఖచ్చితంగా చెప్పలేముగాని, మూడువందల యేళ్ళు వుండవచ్చు! ఆమె శరీరం అస్థిపంజరంలా ఉన్నది. ఒళ్ళంతా ముడతలు, కాని ప్రకాశవంతంగా ఉన్నది. కళ్ళు కణకణలాడే నిప్పుకణికల్లా అతి భయానకంగా ఉన్నాయి. వేలిగోళ్ళు పాముల్లా వంకీలు తిరిగి ఉన్నాయి.

"ఏమిటి సంగతి? మన ప్రయత్నం ఫలించిందా?" అని అడిగింది ముసలి మంత్రగత్తె.

వీరవికటుడు ముసలి మంత్రగత్తె పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసి,







లేచినిలబడి, ''అవును! ఆ మణి ఇప్పుడు యువరాణి కంఠహారంలో ఉన్నది. అది త్వరలో నా చేతికి రాగలదని భావిస్తు న్నాను!'' అన్నాడు.

''ఒక్క మణి మాత్రమేనా నీ చేతికి వచ్చేది?'' అని అడిగింది మంత్రగత్తె.

వెంటనే సమాధానం చెప్పలేక వీర వికటుడు మౌనంగా చూడసాగాడు. వాడి వాలకాన్ని చూసి, మంత్రగత్తె గుహ మారుమోగేలా వింతధ్వనితో నవ్వింది.

''నీ ఉద్దేశం నాకు అర్థం కావడం లేదు, తల్లీ! ఆ మణితోపాటు మరేదైనా కావాలని కోరుకుంటున్నావా?'' అని అడిగాడు వీరవికటుడు.

''మరేదో నాకెందుకురా మూర్ఖుడా! నువ్వు గొప్పగా భావించే ఆ చంద్రకాంత మణినైనాసరే నేను కావాలన్నానా?'' అని అడిగింది మంత్రగత్తె.

''లేదు. ఆ మణిని ఎలా సాధించాలో తెలియజేసింది, నువ్వు. అది కూడా నా కోసమే కదా! అందుకు నిర్మలమైన నీ కరుణాస్వభావమే కారణం?'' అన్నాడు వీరవికటుడు వినయంగా.

''అందుక్కారణం కరుణాస్వభావం కాదురా, మూర్ఖుడా! అసలు నాకు కరుణ అంటేనే తెలియదు. పైగా, నిర్మల మైనదేమిటి, నీ శ్రాద్ధం! నాకు ఐశ్వర్యం మీద ఆశలేదు. అధికారం మీద వ్యామోహం లేదు. నువ్వేమో రాజువై పోవాలని తహతహలాడి పోతున్నావు. రాజయ్యే రహస్యం నాకు తెలుసు కాబట్టి నీకు సహాయపడుతున్నాను. నిన్ను నేను మామూలు రాజును కాదు; ఈ ప్రపం చానికే చక్రవర్తిని చేస్తాను,'' అన్నది మంత్రగత్తె.

''నీమేలు ఈ జన్మకు మరిచిపోను!'' అన్నాడు వీరవికటుడు.

''ఒట్టిమాటలు సరిపోవు. నీకు నేను చేస్తూన్న ఈ సహాయానికి తగిన ప్రతి ఫలం నాకు దక్కాలి!'' అన్నది ముసలి మంత్రగత్తె.





"నీ కోరిక ఏమిటో సెలవివ్వు!" అన్నాడు వీరవికటుడు.

"నాకున్నదల్లా ఒకే ఒక్క కోరిక. నేను పోగొట్టుకున్న యౌవనాన్ని మళ్ళీ పొందాలి! అందుకోసం ఆ మహిమగల మణితోపాటు యువరాణిని కూడా నువ్వు తీసుకురావాలి. ఆ యువరాణి యౌవనాన్ని నేను నా శరీరంలోకి జుర్రుకుంటాను!" అంటూ మంత్రగత్తె బిగ్గరగా నవ్వింది.

ఆ మాటలు వినగానే అపూర్వుడు సైతం కంపించిపోయాడు!

"ఇంతకుపూర్వం కొంతమంది యువతులను బలి ఇచ్చి, వాళ్ళ యౌవనాన్ని పొందాలని ప్రయత్నించావు కదా! అయినా నువ్వు ఎప్పటిలాగే ఉంటున్నావు గాని, మార్పు రాలేదే!" అని తన అనుమానాన్ని వ్యక్తం చేశాడు వీరవికటుడు.

"అపశకునపు కూతలు కూయకు! అప్పటి నా ప్రయత్నం విఫలమయింది, అంతే! అందువల్ల నా ప్రయత్నాన్ని మానుకోమంటావా, మూర్ఖుడా. ఇప్పుడు నా ప్రయత్నం సఫలం కాగలదన్న గట్టి నమ్మకం నాకున్నది. ఎందుకంటే ఆ తంతుకు కావలసిన యువతికి ఉండవలసిన అర్హతలన్నీ రుద్రపురి యువరాణిలో ఉన్నాయి. రాజకుమారి.లోని యౌవనాన్నంతా నా శరీరంలోకి పీల్చుకుంటాను. హా! హా! అప్పుడు చూడు నా ఆనందాన్ని! మళ్ళీ యౌవనం వస్తే ఎంత హాయిగా వుంటుంది! నేనెంత అందంగా ఉండగలనో ఊహించగలవా?" అని అడిగింది మంత్రగత్తె మళ్ళీ బిగ్గరగా నవ్వుతూ

"నువ్వు ఇప్పుడు కూడా అందంగానే ఉన్నావు!" అన్నాడు వీరవికటుడు.

"నోర్ముయ్, మూర్ఖుడా! నీ కపట నాటకాలు నా దగ్గర సాగవు. నావల్ల పనులు కావాలని, ఊరక మూర్ఖంగా పొగడ వద్దు. విన్నావా, నేను చెప్పినట్టు చెయ్. లేదా ఈ క్షణమే ఇక్కడి నుంచి వెళ్ళిపో," అని కీచుకంఠంతో అరిచింది ముసలి మంత్రగత్తె. —(ఇంకావుంది)







# అపూర్వుడి సాహసయాత్రలు

## 12

[రుద్రపురి ప్రధానమంత్రీ, దుష్టమాంత్రికుడు వీరవికటుడూ కలిసి యువరాణి కంఠహారం లోని చంద్రకాంతమణిని అపహరించాలని పథకం వేశారు. వీరవికటుడు ఆ విషయాన్ని మునలి మంత్రగత్తెకు తెలియజేశాడు. యువరాణిని ప్రాణాలతో తనకు అప్పగించమని మంత్రగత్తె వీరవికటుణ్ణి అజ్ఞాపించింది. అపూర్వుడు ఆ విషయాన్ని గ్రహించాడు.—తరవాత]

సకాలంలో కావలసినంతగా వర్షాలు కురియడం వల్ల, రుద్రపురిరాజ్యమంతటా ఆ సంవత్సరం పంటలు బాగా పండాయి. ఎలాంటి లోటూ లేకుండా ప్రజలు హాయిగా వున్నారు గనక, ఆ సంవత్సరం యువరాణి జన్మదిన వేడుకలను ఘనంగా జరపాలని రాజు విశ్వవర్మ నిర్ణయించాడు. ఆ సంగతి వినగానే ప్రధానమంత్రి పట్టరాని ఉత్సాహంతో, ''మన యువరాణి జన్మదిన వేడుకలను కనీ వినీ ఎరుగనంత ఘనంగా జరపాలి!'' అన్నాడు. యువరాణి మీది అభిమానం కొద్దీ ప్రధాన మంత్రి అలా చెబుతున్నాడని భావించి రాజు, అతడి రాజభక్తికి ఎంతగానో పొంగి పోయాడు!

ఆరోజు రాత్రి ఆకాశం నిండా మేఘాలు కమ్ముకోవడం వల్ల, కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటి







వచ్చి గుడిలో దీపం వెలిగించి వెళుతూ ఉంటాడు.

దుర్గామాత దేవాలయానికి దాదాపు వందగజాల దూరంలో అరణ్యాన్ని అనుకుని వున్న బ్రహ్మాండమైన వటవృక్షం సమీపించగానే, వీరవికటుడు ఎలుగు బంటి మీది నుంచి దిగి, భయంతో వణుకుతూన్న ఆ జంతువును, "ఇక్కడే వుండు!" అని కఠినస్వరంతో ఆజ్ఞాపించి దేవాలయం కేసి నడిచాడు.

ఎత్తయిన ఆలయ ద్వారగోపురం వద్ద నిలబడి వున్న వ్యక్తిని చూడగానే, వీర వికటుడు, "కొద్దిగా ఆలస్యమయింది, క్షమించాలి. మంత్రగత్తె దగ్గరికి మళ్ళీ ఒకసారి వెళ్ళి మాట్లాడి వస్తున్నాను, ఆమె నీకొక తాయెత్తు పంపింది. దానిని ధరించావంటే నీలోని భయాలన్నీ మటు మాయమైపోతాయి. ఆపదల నుంచి నీకు రక్షణ కలుగుతుంది," అన్నాడు

అక్కడ నిలబడిన ప్రధానమంత్రి, "ధన్యుణ్ణి! నీ మేలు ఈ జన్మలో మరిచి పోను," అంటూ వీరవికటుడికి నమస్కరించాడు.

వీరవికటుడు, తన సంచీలో దాచిన తాయెత్తును తీసి, మంత్రి మణికట్టుకు కట్టాడు. ఆ తాయెత్తును ధరిస్తే, ప్రధాన మంత్రి, వీరవికటుడు చెప్పినట్టల్లా ఆడ

అలముకున్నది. ఉరుములతో, మెరుపులతో అప్పుడప్పుడు వర్షం కురుస్తున్నది. ఆ వర్షంలో వీరవికటుడు నల్లటి దుస్తులు ధరించి, తన వాహనమైన ఎలుగుబంటి మీద అరణ్యం నుంచి రుద్రపురి నగర పొలిమేరలో వున్న దుర్గామాత ఆలయం కేసి వస్తున్నాడు. రాజకుటుంబానికి మాత్రమే కాదు; రుద్రపురి రాజ్యానికే ఆరాధ్యదేవత దుర్గామాత! దుర్గామాత ఆలయం భయంకరమైన అరణ్య సమీపంలో వుండడంవల్ల అక్కడ అంతగా జనసంచారం ఉండదు. రాత్రి పూటయితే ఆలయంలో కూడా ఎవరూ వుండరు. పూజారి కూడా పెందలాడే





గలదని మంత్రగత్తె చెప్పి పంపింది. అయితే, ఆ విషయం తెలియని ప్రధాన మంత్రి దానిని చూసుకుని సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయిపోయాడు!

''యువరాణి పుట్టినరోజు, ఆమె దేవీ దర్శనానికి రావడానికి తగిన శుభ ఘడియలు పంచాంగం చూసి నిర్ణయించావా?'' అని అడిగాడు మాంత్రికుడు తన పొడవాటి గడ్డాన్ని చేత్తో దువ్వుకుంటూ.

''నిర్ణయించాను! సూర్యాస్తమయం అయిన ఒక గంట తరవాత శుభప్రదమని చెప్పాను!'' అన్నాడు మంత్రి.

''ఆ రాత్రి చీకటిగా కూడా వుండాలి. అంటే, ఈ లెక్కన మన లక్ష్యం నెరవేరడానికి ఒక్క నెల మాత్రమే ఉందన్న మాట! అంతే కదా?'' అని అడిగాడు వీరవికటుడు గర్వంగా నవ్వుతూ.

''అవును, మిత్రమా! మన పథకం నిరాటంకంగా నెరవేరగలదనడంలో నాకు ఇసుమంత సందేహం కూడా లేదు. ఇప్పుడు దేవాలయం తలుపులు తీయడానికి కావలసిన తాళం చెవులు తెచ్చాను. రాజకుటుంబానికి చెందిన వాళ్ళు హఠాత్తుగా ఏదైనా ఆపద వాటిల్లినప్పుడు అక్కడి నుంచి తప్పించుకోవడానికి అనువుగా, ఆలయ గర్భగృహం నుంచి, రహస్య సొరంగమార్గం



ఉన్నదని చెప్పాను కదా, దానిని ఎలా తెరవాలో, మూయాలో నాకు తెలుసు. అయినా, ఇంతవరకు దానిని ఉపయోగించుకోవలసిన అవసరం రాజకుటుంబంలో ఎవరికీ కలగలేదు. అది, ఇప్పుడు మన పథకం నెరవేరడానికి ఇలా ఉపయోగ పడనున్నది! లోపలికి వెళ్ళి చూద్దామా,'' అంటూ మంత్రి గుడి ద్వారం కేసి నడిచాడు ఉత్సాహంగా.

''చూద్దాం పద. అందుకే కదా వచ్చింది,'' అన్నాడు వీరవికటుడు.

మంత్రి గుడి తలుపులు తెరిచాడు. ఇద్దరూ లోపలికి వెళ్ళి, తలుపులు మూసేశారు. లోపల మంత్రి చిన్న కాగడాను వెలి





గించి పట్టుకున్నాడు. ఇద్దరూ గర్భగృహం లోకి అడుగుపెట్టారు. దుర్గామాత విగ్రహం ముందు చిన్న చిన్న మట్టి ప్రమిదలలో దీపాలు వెలుగుతున్నాయి. దుర్గామాత విగ్రహానికీ, వెనకగోడకూ మధ్య కొంత ఖాళీ స్థలం ఉన్నది. దానిని ఆనుకుని వున్న గోడ మీద రకరకాల శిల్పాలు చెక్కబడి ఉన్నాయి. మంత్రి కాగడాను పక్కన ఆనించి, రెండు చేతులతో ఒక రాక్షసాకార విగ్రహం నోటిని తెరిచాడు. వెంటనే విగ్రహం వెనక సొరంగమార్గం తెరుచుకున్నది.

మంత్రీ, మాంత్రికుడూ ఇద్దరూ సొరంగ మార్గంలోకి దిగారు.

అంతవరకూ, ఆ ఇరువురికీ తెలియకుండా వారి వెన్నంటి వచ్చిన అపూర్వుడు, గర్భగృహంలోని దుర్గామాత విగ్రహం దగ్గర నిలబడి, రహస్య సొరంగమార్గం తలుపును మూసేద్దామా అని ఒక క్షణం ఆలోచించాడు. కాని, ఆ దుర్మార్గులు సొరంగమార్గం అవతలి వైపునుంచి తప్పించుకుని పారిపోగలరు. అందువల్ల మూసివేయడం వల్ల పెద్ద ప్రయోజనం ఏదీ లేదని ఊరుకున్నాడు. సొరంగమార్గం అవతలి చివర ఎక్కడున్నదో అపూర్వుడికి తెలియదు. దానిని తెలుసుకోవాలంటే వాళ్ళ వెంట సొరంగంలోకి దిగడమే మంచిదని అతడు ఒక్క అడుగు ముందుకు వేసేలోగా, సొరంగమార్గ ద్వారంతోపాటు రాక్షసాకార విగ్రహం యొక్క నోరు కూడా మూసుకుపోయింది. సొరంగ ద్వారం మూయడానికి వీలుగా, సొరంగం లోపల ఏదో ఏర్పాటు ఉన్నదని అపూర్వుడు గ్రహించాడు.

గుడి తలుపులు తెరిచే ఉన్నాయి. వాటిని మూయకుండా, మంత్రీ, మాంత్రికుడూ వెళ్ళే అవకాశం లేదు. కాబట్టి తలుపులు మూయడానికి వాళ్ళు, తప్పకుండా రాగలరని అనుకుంటూ, అపూర్వుడు గుడి నుంచి బయటకు వచ్చి, ఒక స్తంభం చాటున కూర్చున్నాడు.







''నా మనుషులు కాదు; సాక్షాత్తు మంత్రగత్తే అక్కడ కాచుకుని వుంటుంది. కోడిపిల్లను, గద్ద తన్నుకుపోయినట్టు ఆమె యువరాణిని తన్నుకుపోగలదు!'' అన్నాడు వీరవికటుడు గర్వంగా నవ్వుతూ.

''శభాష్! అయితే అన్నీ క్షణాలలో జరిగిపోవాలి. ఎందుకంటే వేడుకలు ఎంత కోలాహలంగా జరిగినప్పటికీ, యువరాణి ఐదారు నిమిషాలు కనిపించక పోయినా చెలికత్తెలు పసిగట్టగలరు; ఆ తరవాత ఆమెను వెదకడం ప్రారంభించ గలరు. జాగ్రత్త!'' అన్నాడు మంత్రి.

''వెదకడం ప్రారంభించినా, యువరాణిని సొరంగమార్గంలోకి తోశారని మరో కంటికి తెలిస్తేగదా పట్టుకోవడానికి? ఆలయ గర్భగృహంలోని, రహస్యమార్గం గురించి ఎంతమందికి తెలుసు?'' అని అడిగాడు వీరవికటుడు.

''రాజుకూ, రాణికీ, ఆలయపూజారికీ, నాకూ, సేనానాయకుడికీ మాత్రమే ఆ రహస్యమార్గం గురించి తెలుసు. మరెవ్వరికీ తెలియదు!'' అన్నాడు మంత్రి.

''అలాగా....పూజారిని లొంగదీసుకోవడం కష్టమని అంటున్నావు. ఒకవేళ పూజారికి మన పథకం తెలిస్తే దానిని అతడు రాజుకు చెప్పే అపాయం వుంది కదా!'' అన్నాడు వీరవికటుడు.

అతడు అనుకున్నట్టే ఒక గంటసేపు తరవాత, మంత్రీ, మాంత్రికుడూ గుడి నుంచి బయటకు వచ్చారు. మంత్రి తలుపులు మూసి తాళం వేస్తూ, మాంత్రికుడితో, ''నేను యువరాణిని సొరంగ మార్గంలోకి తోయగానే, ఆమెను లోపలికి తీసుకుపోయి, నేను చూపినట్టు, లోపలి నుంచి, ప్రవేశద్వారాన్ని మూసి వేయవలసిన బాధ్యత నీది. సొరంగ మార్గంకుండా యువరాణిని అరణ్య మధ్యానికి తీసుకుపోయి, నీ మనుషులకు అప్పగించాలి. వాళ్ళు ఆమెను అక్కడి నుంచి మంత్రగత్తె వద్దకు తీసుకు వెళ్ళాలి!'' అన్నాడు.



''అవును, చెప్పగలడు. ఏం చేద్దాం!'' అన్నాడు మంత్రి.

"సాయంకాలం యువరాణి దుర్గామాత మందిరానికి రాకముందే, పూజారిని పర లోకానికి పంపేద్దాం. నేనే పూజారి వేషం వేసుకుని యువరాణిని దేవాలయంలోకి తీసుకుపోయి, విగ్రహానికి ప్రదక్షిణ చేయించడం శుభప్రదమని మంచి మాటలు చెప్పి, ఆమెను విగ్రహం వెనకకు తీసుకు పోయి, సొరంగమార్గంలోకి తోసి, నేనూ లోపలికి వెళ్ళి, సొరంగ మార్గద్వారం మూసేస్తాను!'' అన్నాడు వీరవికటుడు వికటంగా నవ్వుతూ.

''ఆలోచన బాగానే వున్నది. అయినా, అందుకు పూజారి ప్రాణం తీయాలా? మరొకమార్గంఏదైనా వుంటేచూడు. పూజారి చాలా మంచివాడు!'' అన్నాడు మంత్రి.

''మరీ ఇంత పిరికిగుండెకలవాడివి, రేపు ఈ భూప్రపంచాన్ని ఎలా పరి పాలించగలవు? చంద్రకాంత మణి నిన్ను ఈ ప్రపంచానికే చక్రవర్తిని చేయ నున్నది! సరేలే....విచారించకు. నీ ఇష్టాను సారమే చేస్తాను. మన పని పూర్తయ్యేంత వరకు పూజారిని చంపకుండా ఎవరికీ తెలియని రహస్య స్థలంలో దాచేద్దాం. సరేనా, ఇక వెళదామా?'' అంటూ వీర వికటుడు వటవృక్షం కేసి నడిచాడు.

వాడి నుంచి అనుమతి తీసుకుని మంత్రి నగరం కేసి నడవసాగాడు.

అంతవరకు ఒక స్తంభం చాటున దాగి వారి సంభాషణలు విన్న అపూర్వుడు, ఇప్పుడు ఎవరి వెంట వెళ్ళడమా అని ఒక్క నిమిషం సందిగ్ధంలో పడ్డాడు. ఎలాగూ ఆ దుర్మార్గులు తలపెట్టిన కుట్ర తనకు తెలిసిపోయింది గనక, ఇక వాళ్ళ వెంట వెళ్ళడం కన్నా, ఆ విషయాన్ని రాజు విశ్వవర్మ దృష్టికి తీసుకు రావడం ఉత్తమం. అప్పుడే వాళ్ళ దుష్టపథకాన్ని కొనసాగకుండా ఆపవచ్చు. అయినా, ఈ విషయాన్ని రాజుగారికి తెలియజేయడం ఎలా? అని అపూర్వుడు తీవ్రంగా ఆలో చించసాగాడు. —(ఇంకావుంది)








## 13

[రుద్రపురి యువరాణి కంఠహారంలోని చంద్రకాంతమణిని అపహరించాలని మంత్రీ,మాంత్రికుడూ పథకం వేశారు. యువరాణిని ప్రాణంతో తనకు అప్పగించమని మంత్రగత్తెమాంత్రికుణ్ణి ఆజ్ఞాపించింది. దుర్గామాత ఆలయంలోని సొరంగ మార్గం గుండా యువరాణిని తీసుకువెళ్ళాలని మాంత్రికుడు, పథకం వేశాడు: ఆ సంగతి అపూర్వుడు తెలుసుకున్నాడు. —తరవాత]

యువరాణి జన్మదినం సమీపిస్తున్నది. మంత్రీ, మాంత్రికుల దుష్టపథకం గురించి రాజు విశ్వవర్మకు తెలియజేయాలని, అపూర్వుడు సమీరుడి దగ్గరకు వెళ్ళాడు.

అంతదూరంలో అపూర్వుణ్ణి చూస్తూనే అమితానందం చెందిన సమీరుడు, అతడు చెప్పిన సంగతి విని, దానిని రాజుకు తెలియజేయడానికి రాజధానికి బయలు దేరాడు.

అది మరొక కాళరాత్రి సమయం. మాంత్రికుడు వీరవికటుడు రహస్యంగా వెళ్ళి ప్రధానమంత్రి భవనం తలుపు తట్టాడు. భవనం నుంచి వెలుపలికి వచ్చిన మంత్రి, "అపరాత్రివేళ వచ్చావేమిటి?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"అపరాత్రివేళ కాకపోతే, నేనెప్పుడైనా పట్టపగలు నిన్ను చూడడానికి వచ్చానా?" అన్నాడు వీరవికటుడు వెటకారంగా.







మవ్వీ విషయం నీ భార్యకుగానీ, మిత్రులకుగానీ చెప్పావా?'' అని అడిగాడు మాంత్రికుడు.

''లేదు. మన చిన్ననాటి స్నేహంమీద ప్రమాణం చేసి చెబుతున్నాను!'' అన్నాడు ప్రధానమంత్రి దృఢస్వరంతో.

''నిన్ను నమ్ముతున్నాను! అయినా, మన పథకం జయప్రదం కావాలంటే మనం మరింత జాగ్రత్త వహించాలి. విశ్వాసపాత్రులయిన నీ భటులను, రాజభవనం చుట్టూ కాపలావుంచు. కాపలా రాత్రింబవళ్ళు కొనసాగాలి. కొత్త వాళ్ళెవరు గాని రాజును దర్శించకూడదు. అయితే, ఇటువంటి కట్టుదిట్టమైన నిఘా ఎందుకు ఏర్పాటుచేశామన్న సంగతి నీ మనుషులకు కూడా తెలియకూడదు. జాగ్రత్త!'' అని హెచ్చరించి మాంత్రికుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

తెల్లవారగానే మంత్రి, మాంత్రికుడు చెప్పిన విధంగా తనకు విశ్వాసపాత్రులయిన భటులను భవనం చుట్టూ కాపలా వుంచాడు. సమీరుడు రాజదర్శనానికి వెళ్ళాలంటే భటులు అనుమతించలేదు.

రేపే యువరాణి జన్మదినం. కోలాహలంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. మంత్రీ, మాంత్రికుల కుట్ర గురించి ఎలాగైనా రాజుకు తెలియజేయాలని

''అలా అని కాదు. ఏదైనా అవాంతరం ఏర్పడి, ముఖ్యమైన కార్యంమీద వచ్చావేమో అని అడిగాను,'' అన్నాడు మంత్రి.

''అవును. చాలా ముఖ్యమైన కార్యంమీదే వచ్చాను. మన పథకం ఎలాగో మూడోవ్యక్తికి తెలిసిపోయిందని మంత్రగత్తె భావిస్తున్నది. మనమీద ఎవరో నిఘావేసి ఉన్నారు!'' అన్నాడు వీరవికటుడు కనుబొమలు ఎగురవేస్తూ.

''అది అసంభవం!'' అన్నాడు ప్రధానమంత్రి.

''మంత్రగత్తె మనసులో అటువంటి అనుమానం కలిగిందంటే, అందులో తప్పకుండా నిజం వుండి తీరుతుంది.





అపూర్వుడు తీవ్రంగా ఆలోచించసాగాడు. రాజప్రాసాదం ఉపరితలంలో నిలబడి రోజూ సూర్యాస్తమయ దృశ్యం చూడడం రాజుకు అలవాటు. సమీరుడు ఈ విషయం అపూర్వుడికి తెలియజేశాడు. వెంటనే అపూర్వుడు ఒక తాళపత్రంమీద దుష్టుల పథకం గురించి క్లుప్తంగా రాసి, యువ రాణికీ, దేవీ ఆలయ పూజారికీ బలమైన రక్షణ ఏర్పాటు చేయాలనీ, ఎట్టిపరిస్థితి లోనూ యువరాణి, దేవీ ఆలయం లోపల, విగ్రహంవెనకకు పోరాదనీ రాసి, దూరంగా ఎగురుతూన్న ఒక గద్దను పిలిచాడు. అది వచ్చి అపూర్వుడి ఎదట వాలి, ఆ లేఖను అందుకుని, మరుక్షణమే రాజప్రాసాదం కేసి ఎగిరి వెళ్ళింది!




ముక్కుతో లేఖను తీసుకు వెళుతూన్న గద్దను చూడగానే, కాపలా భటుడొకడు ఉత్సాహం కొద్దీ దాని మీదికి ఒక బాణం వదిలాడు. బాణం గురి తప్పింది కాని, గద్ద బాణాన్ని చూసి బెదిరిపోయి, లేఖను కిందికి జారవిడిచి, మరొక దిక్కుకేసి పారి పోయింది. అపూర్వుడు రాసి పంపిన లేఖ కోటచుట్టూ వున్న అగడ్తలో పడిపోయింది!

గద్ద సగం దారిలోనే తిరిగి వెళ్ళడం అపూర్వుడు గమనించలేదు. తన లేఖను అది రాజుకు అందజేసి వుంటుందనీ, రాజు యువరాణికి కావలసిన రక్షణ ఏర్పాట్లు చేయగలడనీ ఆశించి, ఏమి జరుగుతుందో ఎదురుచూడసాగాడు.

రాజధానీనగరం వేకువజాము నుంచే యువరాణి జన్మదిన వేడుకల కారణంగా కళకళలాడ సాగింది. రుద్రపురి రాజ్య ప్రముఖులూ, ఇరుగుపొరుగు రాజ్యాల నుంచి వచ్చిన రాజప్రతినిధులూ, రాజ బంధువులూ యువరాణికి శుభాకాంక్షలు తెలియజేయసాగారు. సమీరుడు జనం మధ్య తిరుగుతూ, అక్కడి విశేషాలను ఎప్పటికప్పుడు, చాటుగా వున్న అపూర్వు డికి తెలియజేయసాగాడు.

రాజు ముఖంలో గాని, యువరాణి ముఖంలో గాని ఎటువంటి మార్పూ లేక





తన చెలికత్తెలతో కలిసి ఆలయంలోకి అడుగుపెట్టగానే, పూజారి వేషంలో వున్న మాంత్రికుడు తన శిష్యులతో ఎదురు వచ్చి ఆమెను లోపలికి తీసుకువెళ్ళాడు. యువరాణి దుర్గామాతవిగ్రహం ముందు నిలబడి భక్తితో చేతులెత్తి నమస్కరించింది. పూజారి ఏవో మంత్రాలు గట్టిగా ఉచ్చరిస్తూ, యువరాణితో, "రా తల్లీ, రా. దుష్టసంహారిణి అయిన దుర్గామాతకు మూడుసార్లు ప్రదక్షిణ చేయడం శుభప్రదం!" అంటూ ముందుకునడిచాడు.

యువరాణి అతన్ని అనుసరించింది. పూజారి వెనక్కు తిరిగి, "యువరాణి తప్ప మరెవ్వరూ రాకూడదు. ఆమెచేత కొన్ని ప్రత్యేకమైన పూజలు చేయించాలి," అన్నాడు.

చెలికత్తెలు అక్కడే ఆగిపోయారు.

పూజారి శిష్యులిద్దరూ గట్టిగా మంత్రాలు పఠించసాగారు. భజంత్రీలతో, గంటా నాదాలతో ఆలయం మారుమ్రోగుతున్నది.

యువరాణి గర్భగృహం వెనక్కు వెళ్ళగానే పూజారి వేషంలోని మాంత్రికుడు ఆమెను చప్పున సొరంగమార్గంలోకి తోసి, తానూ దిగిపోయి మార్గద్వారాన్ని మూసివేశాడు.

రాజు పరివారంతో ఆలయానికి వెలుపలే వున్నాడు. సమీరుడు జనం మధ్య నుంచి

పోవడం అపూర్వుడికి ఆశ్చర్యం కలిగించింది. యువరాణి రక్షణకోసం ప్రత్యేకంగా జాగ్రత్తలు తీసుకున్న సూచనలేవీ కనిపించలేదు. తాను గద్ద ద్వారా పంపిన లేఖ రాజుకు అందలేదేమో అన్న అనుమానం అపూర్వుడికి కలిగింది. సాయంకాలమయింది. రాజూ, యువరాణీ పరివారంతో అప్పుడే ఊరేగింపుగా దుర్గాదేవి మందిరానికి బయలుదేరినట్టు తెలిసింది. వెంటనే సమీరుడితో కలిసి అపూర్వుడు కూడా ఆలయం కేసి బయలుదేరాడు.

యువరాణి ఆలయానికి వస్తున్నదని తెలియగానే, ఆనందంతో వేలాదిమంది జనం అక్కడ గుమిగూడారు. యువరాణి





హఠాత్తుగా ముందుకు వచ్చి, ''మహా రాజా! యువరాణిని అపహరించుకుని పోయారు!'' అన్నాడు.

రాజు సమీరుణ్ణి వింతగా చూశాడు.

''నేను సమీరుణ్ణి మహారాజా! నా మాట నమ్మండి. యువరాణిని మాంత్రికుడు అపహరించుకుని వెళ్ళిపోయాడు!'' అన్నాడు సమీరుడు మళ్ళీ.

''యువరాణి దుర్గామాత దర్శనానికి ఆలయంలోకి వెళ్ళిందికదా?'' అన్నాడు రాజు.

''యువరాణి, అక్కడ లేదు!'' అన్నాడు సమీరుడు.

''అలాగా!'' అంటూ రాజు ఆలయంలోకి నడిచాడు. అంతలో చెలికత్తెలు యువరాణి కనిపించడం లేదని కంగారుతో పరిగెత్తుకుంటూ ఎదురు వచ్చారు.

అక్కడి నుంచి పారిపోవాలని చూస్తూన్న మాంత్రికుడి శిష్యులను చూడగానే సమీరుడు, ''మహారాజా! ఆ దుర్మార్గులను పట్టి బంధించమని చెప్పండి,'' అన్నాడు.

వెంటనే శిష్యులిద్దరినీ భటులు పట్టుకున్నారు.

సమీరుడు, ''మహారాజా, మనం ఇప్పుడే సారంగమార్గం అవతలి చివరను చేరుకోవాలి,'' అన్నాడు.



రాజూ, సేనానాయకుడూ, సమీరుడూ మరి కొందరు అంగరక్షకులూ గుర్రాల మీద బయలుదేరి, కొంతసేపటికల్లా, అరణ్య మధ్యంలో వున్న సారంగమార్గం అవతలి చివరను చేరుకున్నారు.

సమీరుడు, సేనానాయకుడి గుర్రం పైనుంచి కిందికి దిగుతూ, ''మహారాజా! ఆ మంత్రగత్తెను పట్టి బంధించమనండి!'' అన్నాడు.

''హఁహఁహ....నన్నే బంధించగల సమర్థులు వచ్చారా? ఇప్పుడే మిమ్మల్ని భస్మం చేయగలను!'' అంటూ వికటంగా నవ్వసాగింది, ఎండిపోయిన మర్రికొమ్మ మీద కూర్చున్న ముసలి మంత్రగత్తె.





"కూర్చున్నచోటు నుంచి కదిలావో, భస్మమైపోగలవు! జాగ్రత్త!" అని హెచ్చరించింది ఒక గంభీరమైన కంఠస్వరం.

అందరూ ఆ కంఠస్వరం వినిపించిన దిక్కుకేసి చూశారు.

అక్కడ దివ్యతేజస్సుతో ఒక ముని పుంగవుడు కనిపించాడు. మునిని చూడగానే సమీరుడు ఆయన పాదాలకు నమస్కరించి, "ఏదైనా జటిలమైన సమస్య ఎదురైనప్పుడు, భక్తితో స్మరిస్తే తమరు రాగలరని అపూర్వుడు నాకు చెప్పాడు!" అన్నాడు.

సదానందముని చిన్నగా నవ్వి ఇలా అన్నాడు:

"అవును. నీవన్నది నిజం. ధ్యానంలో వుండగా అపూర్వుడి పిలుపు వినిపించి ఇలా వచ్చాను. అదిగో అక్కడ కూర్చున్నది మామూలు మంత్రగత్తె కాదు. గొప్ప శక్తులుగల పరమదుర్మార్గురాలు. ప్రకృతికి విరుద్ధంగా, పరుల యౌవనాన్ని కాజేస్తూ అనేక శతాబ్దాలుగా జీవిస్తున్నది. ఇప్పుడు యువరాణి యౌవనాన్ని కాజేయాలని పథకం వేసింది. అయినా, ఆ దుష్టురాలి శక్తులన్నిటినీ నాశనం చేశాను!"

మంత్రగత్తె కీచుమని అరిచి, "నువ్వు నా శక్తులన్నిటినీ నాశనం చేయలేవు. నావద్ద ఇంకా ఒక శక్తి మిగిలి ఉన్నది." అని అడవి దద్దరిల్లే విధంగా బాధతో నవ్వుతూ, క్షణంలో భగ్గున మండి బూడిదయిపోయింది!

ఆ దృశ్యాన్ని చూసి ఒక్క క్షణం నివ్వెరపోయిన రాజు, సదానందమునికి నమస్కరిస్తూ, "మహాత్మా, నా బిడ్డ క్షేమంగా ఉన్నది కదా?" అని అడిగాడు.

"అపూర్వుడు కనిపించడం లేదే!" అన్నాడు సమీరుడు.

"తన పథకం ఎదురుదెబ్బ తిన్నదని తెలియగానే, మంత్రగత్తె ఆ విషయాన్ని సారంగంలో వస్తూన్న మాంత్రికుడికి తెలియజేసింది. మాంత్రికుడు, తన ప్రాణాలు కాపాడుకోవడానికి యువరాణిని

అడ్డుగా ఉపయోగించుకొని, ఎలాగైనా చంద్రకాంతమణితో పారిపోవాలని చూశాడు. అందుకే అపూర్వుడు ఒక కన్నం ద్వారా సొరంగ మార్గంలోకి ప్రవేశించి, మాంత్రికుడితో పోరాడి బంధించాడు. అతడు యువరాణిని క్షేమంగా తీసుకురాగలడు," అన్నాడు ముని.

అంతలోనే మర్రి వృక్షం సమీపంలో భూమి అడుగునుంచి శబ్దం వినిపించింది. కొంతసేపటికి సొరంగమార్గ ద్వారం తెరుచుకుని దివ్యపురుషుడిలాగా కనిపించే ఒక యువకుడు, పెడరెక్కలు విరిచి కట్టిన మాంత్రికుణ్ణి లాక్కుని పైకి వచ్చాడు. మాంత్రికుడు వెలవెలబోతూ, నేలచూపులు చూడసాగాడు. వాళ్ళ వెనకగా వచ్చిన యువరాణి తండ్రిని చూడగానే పరుగునపోయి ఆయనపక్కన నిలబడింది.

యువకుడు ముని పాదాలకు నమస్కరించబోయాడు. ముని ఆప్యాయంగా వారించి, "నాయనా, అపూర్వా! నువ్వు మామూలుమానవాకారం పొందడానికి తగిన తరుణం ఆసన్నమయింది. ఇకపై ఇలాగే కొనసాగగలవు!" అన్నాడు.

"నాన్నా, నన్ను ఆ దుర్మార్గుడి బారినుంచి ఈ యువకుడే రక్షించాడు!" అన్నది యువరాణి అపూర్వుణ్ణి చూపుతూ.

"అతడు చేసిన ఉపకారం ఈ జన్మలో మరువరానిది!" అంటూ రాజు అపూర్వుడికేసి చూశాడు.



"నేను వచ్చిన పని పూర్తయింది. ఇక వెళ్ళివస్తాను," అన్నాడు ముని.

"నేనూ, మీతో వస్తాను," అన్నాడు అపూర్వుడు.

"నిన్ను నా వెంట తీసుకు వెళ్ళడానికా నీకు మామూలు మానవరూపం ఇచ్చాను? ఇంతవరకు నువ్వు ఎవ్వరికీ కనిపించకుండా, మంచివారికి మేలు చేస్తూ వచ్చావు. ఈ క్షణం నుంచి, సాధారణ మానవరూపంలో, అందరికీ కనిపిస్తూ, ప్రజానాయకుడిగా అచంచలమైన ధైర్య సాహసాలతో, ధర్మదీక్షతో నీ కర్తవ్యాన్ని నిర్వహించాలి!" అన్నాడు ముని.

"అదెలా సాధ్యం?" అని అడిగాడు అపూర్వుడు అనుమానంగా.

ముని ఏదో అనబోయేంతలో, రాజు, "ఈనాటి నుంచి నా రాజ్యం నీ అధీనంలో వుంటుంది. ముని అంగీకరించినట్టయితే నువ్వే నా రాజ్యానికి వారసుడివి కాగలవు. నీకూ, నా కుమార్తెకూ ఇష్టమయినట్టయితే, యువరాణి మేనమామ రాజ్యం లావణ్యపురికి కూడా నువ్వే అధిపతివి కాగలవు!" అన్నాడు.

అపూర్వుడు యువరాణి కేసి చూశాడు. యువరాణి సిగ్గుతో తల వంచుకున్నది. సదానందముని వాళ్ళిద్దరినీ దగ్గరికి పిలిచి, "మీరు మునుముందు మానవజాతికి మేలు కలిగించే ఘనకార్యాలెన్నో సాధించి, భావితరాలకు ఆదర్శదంపతులు కాగలరు!" అని ఆశీర్వదించి, అదృశ్యమైపోయాడు.

రాజుతో సహా అక్కడి వారందరూ ఒక్క క్షణం ఆశ్చర్యపోయి, ఆ తరవాత అమితానందం చెందారు.

రాజు మాంత్రికుణ్ణీ, మంత్రినీ చెరసాలలో బంధించమని ఆజ్ఞాపించాడు.

యువరాణికీ, అపూర్వుడికీ వైభవంగా వివాహం జరిగింది. రాజు, అపూర్వుడికి రుద్రపురి రాజ్య పట్టాభిషేకం చేశాడు. అపూర్వుడు సమీరుణ్ణి తన ప్రధానమంత్రిగా చేసుకుని చిరకాలం ప్రజారంజకంగా పరిపాలన సాగించాడు. —(అయిపోయింది)



